ఆధునిక సాహిత్య వేదిక

# సృజన

ఆగస్టు '82
130



# సృజన దగ్గర దొరికే పుస్తకాలు

1. ఏం చేయాలి ? - లెనిన్ — రు. 4-50
2. నా కుటుంబం-నవల-టాప్‌చెంగ్ — 4-00
3. భూమి-అల్లంరాజయ్య కథలు — 5-00
4. భారత కార్మికోద్యమ చరిత్ర- కె బాలగోపాల్ — 0-50
5. జాతుల సమస్య-ఒక పరిశీలన- కె. ప్రసాదరావు — 0-75
6. ఉప్పెన-నవల రెండో భాగం - చౌ-లి పో — 6-00
7. చెరబండరాజు కవితలు పాటలు — 6-00
8. మలయా కమ్యూనిస్టు పార్టీ - రెండు చారిత్రక పత్రాలు — 1-50
9. రగులుకొనే రాక్షసి బొగ్గు-టురా — 5-00
10. రోడ్డుమీద సూర్యుడు-కవితలు- కె. రాంమోహన్‌రాజా — 3-00
11. రిహార్సల్-కవితలు- ఎస్. కె. — 2-00
12. వర్గీస్ పాటలు — 3-00
13. దుడుం-విరసం కవితా సంకలనం — 1-25
14. జూలియస్ ఫ్యూచిక్- ఉషా ఎస్. డాని — 4-00
15. మృత్యుశిఖరం మీదయుద్ధ ఫిరంగి-చెరబండరాజు కోసం కవితా సంకలనం — 1-00
16. గోదావరి లోయ కవితలు-సమ్మ — 3-50
17. ప్రజాస్వామిక సంస్కృతి-కొత్త, కెవిఆర్, రామకృష్ణ, ప్రసాద్ — 3-50
18. పల్లవి-కవితలు- చెరబండరాజు — 1-50
19. ఎర్రగాలి-కవితలు- జైరాం — 4-00
20. విప్లవోద్యమానికి సిపిఐ విద్రోహం — 1-00
21. కొలిమి-కవితలు- సాగర్ — 2-00
22. నాగేటి చాళ్ళలో రగిలిన రైతాంగ పోరాటం — 2-00
23. లూసున్ సాహిత్య జీవితం — 1-50
24. పోరాటాల శ్రీరాములు — 0-75
25. ప్రజాయుద్ధం వర్థిల్లాలి- — 1-50
26. బతుకుపోరు నవల- బి.ఎస్. రాములు — 5-00
27. తెలంగాణ పోరాట పాటలు-రెండో భాగం — 4-00
28. ప్రజల పాటలు-గద్దర్ మాటలు — 1-00
29. మార్క్సిజం-సాహిత్యం-త్రిపురనేని మధుసూదనరావు — 1-25
30. గమ్యం-కవితలు-చెరబండరాజు — 2-00
31. జనం పిల్పులు — 1-00

(తరువాయి కవరు మూడవ పేజీలో....)

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

130 మాసపత్రిక ఆగస్టు 1982



నిర్వహణ

## 'సాహితీ మిత్రులు'

కవర్ : 'ఎన్‌కౌంటర్స్ వ్యతిరేకవారం'లో పౌరహక్కులసంఘం వరంగల్ యూనిట్ ఏర్పాటు చేసిన ప్రదర్శననుంచి

సంవత్సరచందా రు. 20 ఈ సంచిక రు. 2

# స్వాతంత్ర్యం

ఆగస్టు 15న స్వాతంత్ర్యం వచ్చింది- తెలంగాణలో, తెలంగాణ రైతాంగ పోరాటాన్ని బలపరచిన ఆంధ్రలో నాలుగువేల మందిని కాల్చివేయడానికి, భగత్ సింగ్‌ను ఉరితీస్తుంటే మౌనం వహించిన అహింసామూర్తి విగ్రహ మహాత్ముడు గాంధీ బొమ్మచుట్టూ నగ్నంగా పరిగెత్తిస్తూ స్త్రీలను పురుషులను అవమానపరచి కాల్చివేయడానికి నెహ్రూ, పటేల్‌లకు వాళ్ళను నమ్ముకున్న బూర్జువా భూస్వామ్య వర్గాలకు ఆగస్టు 15న స్వాతంత్ర్యం వచ్చింది.

కరువు కాటకాలతో, పెరుగుతున్న ధరలతో ప్రజలు ఆకలికి మలమల మాడుతూ వుంటే ధాన్యాన్ని, ఆహారవస్తువులను, నిత్యావసర వస్తువులను చీకటి బజార్లకు తరలిస్తున్నవాళ్ళను విద్యుత్ స్తంభాలకు వేలాడదీసి ఉరితీయాలని ప్రగల్భాలు పలికి, ధరలు అదుపు చేయాలని ప్రజలు ఆందోళనకు పూనుకుంటే తూటాలు, లాఠీలు తినిపించడానికి నెహ్రూ కాంగ్రెస్‌కు స్వాతంత్ర్యం వచ్చింది.

బ్రిటిష్ వాళ్ళనుంచి తెచ్చుకున్న స్వాతంత్రాన్ని మళ్ళీ అమెరికా, రష్యా, జర్మనీ, ఫ్రాన్సు, బ్రిటన్ మొదలైన సామ్రాజ్యవాద దేశాలకు తాకట్టు పెట్టడానికి నెహ్రూ ఇందిరా నాయకత్వంలోని పాలకవర్గాలకు తప్పకుండా స్వాతంత్ర్యం వచ్చింది. టాటా బిర్లాలను నవభారత నిర్మాతలుగా ప్రకటించి వందల వేల కోట్ల పెట్టుబడులు, లాభాలు గుత్త పెట్టుబడిదారులకు బంగారు గుడ్లు పెడుతుంటే ఆవడిలో సోషలిస్టు తరహా వ్యవస్థను వల్లించి పోరాట రైతాంగం చిందించిన నెత్తురులో మొలకెత్తిన ఎర్రగులాబీని తన గుత్త సొమ్ముగా షోకుగుండీగా గుండెల దగ్గర దాచుకోడానికి నెహ్రూకు, దాసోహమనడానికి రివిజనిస్టులకు స్వాతంత్ర్యం వచ్చింది.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పేరుతో వారసత్వ పరిపాలన కొనసాగించి కాలనాళిక చరిత్రను రచించుకొని ప్రజలు నిర్మించిన చరిత్రను భూస్థాపితం చేయడానికి తీన్‌మూర్తి భవనంమీద మూడురంగుల జెండాకు స్వాతంత్ర్యం వచ్చింది.

నక్సల్బరీలో మట్టిబుక్కి మాణిక్యాలు పండించే సంతాల్‌లు మట్టిమీద తమ హక్కును ప్రకటించినపుడు వాళ్ళ గుండెల్లోకి తుపాకి గుండ్లను గురి చూడడానికి ఇందిరా జ్యోతిబసులకు స్వాతంత్ర్యం వచ్చింది.

"ఎదురుకాల్పుల" అర్థాన్ని మార్చి శ్రీకాకుళంలో గిరిజన రైతాంగ పోరాట నాయకులను, కార్యకర్తలను, సానుభూతి పరులను పట్టుకొని కాల్చివేసి "ఎన్‌కౌంటర్" అని ప్రకటించడానికి ఇందిరా వెంగళరావులకు స్వాతంత్ర్యం వచ్చింది. తన బిడ్డల్ని తాను తినే పులిలాగ, కష్టజీవుల రక్తం రుచి మరిగిన ఇందిరమ్మ తాను నిర్వచించుకున్న రాజ్యాంగాన్ని, చట్టాన్ని, పార్లమెంటును తానే తినడానికి నిజంగా స్వాతంత్ర్యం వచ్చింది.

స్వాతంత్ర్యం వచ్చింది గనుకనే ఎమర్జన్సీ ప్రకటించే స్వాతంత్ర్యం వచ్చింది. స్వాతంత్ర్యం వచ్చింది గనుకనే పార్లమెంటు అసెంబ్లీలను భూస్వామ్య బూర్జువా వర్గాల తెలివయిన ఏజంటుగా ఒక్క వ్యక్తి బొంగరంలా ఆడించే స్వాతంత్ర్యం అమలవుతున్నది.

స్వాతంత్ర్యం రాకపోతే టి టి కృష్ణమాచారి ముంద్రాలు మొదలుకొని అంతులే అంజయ్యలదాకా అవినీతి, లంచగొండి తనాలకు పాల్పడడం సాధ్యమయ్యేదా? ఇందిరా ప్రతిభా ప్రతిష్ఠాన్‌ల ప్రతిష్ఠ పెరిగి వుండేదా? స్వాతంత్ర్యం రాకపోతే సంజీవరెడ్డి, తపసేలు రాజ్యాంగాన్ని రాజ్యాంగబద్ధంగా ఉల్లంఘించి వుండేవారేనా? స్వాతంత్ర్యం రాకపోతే జెయిల్‌సింగు రాజ్యాంగం కాపలాదారు అయ్యుండేవాడేనా?

మౌంటుబాటెన్‌లు గవర్నర్ జనరల్‌లుగా ఉస్మాన్ అలీఖాన్ బహదూర్‌లు రాజ ప్రముఖ్‌లుగా, కామన్‌వెల్త్ యువరాజు పాదాలదగ్గర తివాచీలు పరచే రాష్ట్రపతులు ప్రథమ పౌరులుగా సర్వసత్తాక స్వాతంత్ర్య భారతంలో కాక మీకింకెక్కడయినా కనిపిస్తారా?

ఎంత స్వాతంత్ర్యం రాకపోతే ఈ దేశంలో ముప్పయి ఏళ్ళగా నిర్బంధ ఉచిత విద్య ప్రాథమిక స్థాయిలో అమలు చేస్తూ మళ్ళీ ఈనాడు వయోజన విద్య అవసరం గురించి చెప్పాల్సి వస్తున్నది?

ఈ భారత స్వాతంత్ర్యం ఎంత వికసించి వుండకపోతే అమ్మిన భూములే మళ్ళీ మళ్ళీ అమ్ముతూ చేసిన భూసంస్కరణలే మళ్ళీ మళ్ళీ చేయగలుగుతున్నాం.

తమకు చేతికిదక్కి నోటికి దక్కకుండా పోయిన బుక్కకోసం, తమ విధిగా దున్ని హక్కులనుభవించలేని భూమికోసం, తమ చెమట చుక్కలో చిగురించిన సంపదకోసం, తమ నెత్తుటి బొట్టులో రగుల్కొన్న వెలుగుకోసం చీకటి బతుకుల కష్టజీవులు కరీంనగర్, ఆదిలాబాదులో, తెలంగాణలో పోరాటానికి పూనుకుంటే "ఎన్‌కౌంటర్ల"పై తెరవత్తే స్వాతంత్ర్యం అది నాటకంకాక వాస్తవమయితే ఎట్లా సాధ్యం.

నీకీ దేశంలో స్వాతంత్ర్యం వుంది— నువు న్యాయంగా, నీతిగా, స్వేచ్ఛగా నీకష్టం నీఅన్నంగా తినాలనుకుంటే తప్ప—ఈ విలువలకోసం నిలిచి, పలికి, రాసి, కదిలి, కదిలించి ఎదురు తిరిగితే తప్ప నీకు స్వాతంత్ర్యం వుంది. నువ్వు ఖద్దరు వేస్తావా-నీకు "స్వాతంత్ర యోధుల" దొంగ సర్టిఫికెట్ సంపాదించుకొనే స్వాతంత్ర్యం కూడా వుంది. నువు స్వాతంత్ర్యంకోసం పోరాడావని నీకు ప్రజలు కాదుగదా జైళ్ళు సర్టిఫికెటు ఇవ్వాలి. దేశంలో జెయిళ్ళ సంఖ్య పెంచిన కాంగ్రెస్ నాయకులు

సర్టిఫికెట్లు ఇవ్వాలి. నువ్వు ఖద్దరు వేస్తావా- లీజింగులు అధిగమించడానికి,పర్మిట్లకు, లైసెన్సులకు, కాంట్రాక్టులకు, అన్ని బలాదూర్‌లకు నీకు స్వాతంత్ర్యం వుంది. నువ్వు ఇందిరవో, సంజయ్‌వో వాళ్ళ వాళ్ళ అనుచరుడివో అయితే నీకు నిచ్చెన అక్కర్లేదు నిచ్చెన తన్నేసి గద్దెమీదకి ఎక్కగలవు. లేదా గద్దెనెక్కి నిచ్చెనను తన్నెయ్యగలవు. రాజ్యాంగతీత, పార్లమెంటేతర అధికారాలు అన్నీ నీ 'హస్త' గతం. పార్లమెంటు, కోర్టులు, పండితులు పత్రికలు చేయగలిగిందల్లా అస్తి నాస్తి విచికిత్స. గోలచేస్తే ప్రెస్ బిల్లు తేవడానికి ఈ ఆగస్టు 15 కొత్తగా మరింత స్వాతంత్ర్యం తెస్తున్నది.

నీవు ఖాకీబట్టలు వేసుకొని ఖాదీ బట్టలకు సూరుసాళ్ళు వినమ్రంగా సేవలు చేస్తున్నావా- పట్టుకొని కాల్చేయ్ ప్రజలను, పసిపిల్లలను, విద్యార్థులను, రైతాంగ కార్యకర్తలకు, హరిజనులను, గిరిజనులను, ప్రకటించు ఎన్‌కౌంటర్ అని. నీఇష్టం పట్నంలో పదిమందిముందు పట్టుకొని పక్కన తోటలో కాల్చేస్తావా, కోర్టులో హాజరుపరచి మేజిస్ట్రేట్ ఇంటిముందు ముసుగు వీరునిలా కాల్చేస్తావా, గోడమీంచి తొంగిచూస్తూ బాంబువేస్తే కాలికి తూటా తగిలిందని చెప్తావా, పోలీసు స్టేషనులో దెబ్బలకు చస్తే బండెడు కట్టెలు కొని నువ్వే దహన సంస్కారాలు నిర్వహిస్తావా. నీఇష్టం నీకా స్వాతంత్ర్యం వచ్చింది. మంచినీళ్ళ బావిదగ్గర సద్దులు తింటుంటే చంపు. ఊరవతల బావి దగ్గర పంచాయితీ చెప్తుంటే చుట్టుముట్టి నలువైపుల తరిమి తరిమి చంపు. పశులకొట్టంలో పట్టుకొని చంపు. నిద్రిస్తున్న వాణ్ణి చంపి, అతని చేతిలో పిస్టల్ అతణ్ణే చంపిందని ప్రకటించు. పోలీసు స్టేషనునుంచి భూస్వామికి అప్పగించి క్రైమ్ థ్రిల్లర్ ఎఫెక్ట్ కోసం సరికొత్త తరహాలో చంపించి సాడిస్ట్ ఆనందాన్ని అనుభవించు. అందుకోసం కాకపోతే ఈ స్వాతంత్ర్యం ఇంకెందుకు వచ్చినట్లు!

నీఇష్టం భూస్వాములకు, బూర్జువాలకు ఊడిగడం చేయడానికి నువు ఖాకీ బట్టలేసుకుంటావో, ఖాదీబట్ట లేసుకుంటావో, బ్యూరాక్రసీలో చేరుతావో, యూనివర్శిటీల్లో చేరతావో, అకాడమీలోనో, ఆస్థానంలోనో — నీకు స్వాతంత్ర్యం ఉంది.

ఈ నేలతల్లి సంకెళ్ళు తెంచి కన్నీళ్ళు తుడవడానిక్కాదు. భూస్వామ్యం కరకుగోళ్ళకు, సామ్రాజ్యవాద చేటునోళ్ళకు బలిపెట్టడానికి నీకు స్వాతంత్ర్యం వచ్చింది. ఇదే స్వాతంత్ర్యమని సంబరాలు జరుపుకోవడానికి సందేహమెందుకు? ఎందుకు — ప్రజల స్వేచ్ఛా ప్రజాస్వామ్యాలు కావాలన్నందుకు.

ఆగస్టు 11, 1982

—సంపాదకుడు

కరపత్రం :

## రావిశాస్త్రి

తెలుగును 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అనీ కృష్ణదేవరాయలును ఆంధ్ర భోజుడనీ, మన ఘనతకు ఇతర్లను ప్రమాణంగా వెలకట్టే బానిస సంప్రదాయాన్ని అనుసరించ దల్చుకుంటే, రాచకొండ విశ్వనాథశాస్త్రిని తెలుగు సాహిత్యడికెన్స్ అనొచ్చు. పెట్టుబడిదారీవ్యవస్థ పట్టణ ప్రాంతాలలో సృష్టించే అధోప్రపంచాన్ని వర్ణించడంలో వాళ్ళిద్దరు తమకు తామేసాటి. ఆ అధోప్రపంచపు అమానుషత్వాన్న యినా, ఆ అధోప్రపంచవాసులలో సాధారణంగా వుండే 'లోకజ్ఞాన' మయినా, ఏ సామాజిక శాస్త్రవేత్తకూ అందనంత విపులంగా తమరచనల్లో పొందుపరిచారిద్దరూ.

తేడాలులేవని కాదు. డికెన్స్‌లో వున్న వైవిధ్యం రావిశాస్త్రిలో లేదు. రావిశాస్త్రిలో వున్న ఆశావాదం డికెన్స్‌లో లేదు. డికెన్స్ దృక్పథంలో వున్న 'చిక్క' దనం రావిశాస్త్రిలో లేదు, రావిశాస్త్రి దృక్పథంలో వున్న పదును డికెన్స్‌లో లేదు. డికెన్స్‌ది 'విమర్శనాత్మక వాస్తవికత' అయితే రావిశాస్త్రిది 'సోషలిస్టు వాస్తవికత' కాకున్నా కేవలవిమర్శనుదాటి ప్రత్యామ్నాయాన్ని సూచనప్రాయంగానైనా చెప్ప గల వాస్తవికత, విమర్శకు కేవలం మానవతావాదమే కాకుండ కొంత శాస్త్రీయ వివేచనను ప్రాతిపదికగా కలిగిన వాస్తవికత.

ఈ అధోప్రపంచపు లోకజ్ఞులు తమ లోకజ్ఞానాన్ని పాఠకులతో పంచుకున్న ప్పుడు ఆ వాక్యాలు, శ్రీశ్రీ అన్నట్టు, "one of the greatest passages in all literature" అనే పొగడ్తకు అర్హమవుతాయి. 'మాయ'లో ముత్యాలమ్మ 'నన్నూ నా సంసారాన్ని అంతా అమ్మేసినా వంద రూపాయలు గిట్టవు....' అంటూ మొదలుపెట్టి 'ఈనోకంలె డబ్బూ యాపారం తప్ప మరేటీన్లేవు. పసువులు-నోర్లేని సొమ్ములు నాటికి నీకుంది కాని మనకునేదు. సదువులేన్నాన్ని నాకూనేదు, సదువు కున్నోడివి నీకునేదు' అంటూ బూర్జువా సమాజతత్వం బోధించి 'తాను సదుంకోకున్నా, చూసిన సత్తెం మా త్తరం ఇదే'నని ముగించిన ఉపన్యాసంకాని, 'రత్తాలు రాంబాబు'లో గంగరాజు హెడ్డు తన శిష్యుడు జాగ్రత్తగా 'ఫాలో' అవుతున్నాడా లేదా అని మధ్య మధ్య విచారించుకుంటూ ఎన్నో ఏళ్ళ తన కానిస్టేబిలు జీవిత అనుభవంతో నేరానికీ రాజ్యాంగ యంత్రానికీ ఉన్న సంబంధాన్ని వివరిస్తూ ఇచ్చిన ఉపన్యాసంగాని, ఖచ్చితంగా ఈ కోవకు చెందుతాయి.

ఈ అధోప్రపంచమే ప్రపంచంగాదనీ, పోలీసులు జేబుదొంగలకూ చిల్లర సాదావ్యాపారస్తులకూ చేసే అన్యాయమే అన్యాయం కాదనీ, అసలు ప్రపంచం, అసలు అన్యాయం, శ్రమ దోపిడీలోను అసమాన భూసంబంధాలలోను ఉన్నాయనీ గుర్తించి రాసిన నవల 'సొమ్ములు పోనాయండి'. అటువంటి రచనలు ముందు ముందు గూడ రావిశాస్త్రి చేస్తాడనీ, ఇప్పుడున్న బలహీనతల్ని వదిలించుకుంటాడనీ ఆశిదాం.

(విరసం ప్రచురణ 'రావిశాస్త్రీయం' ఆవిష్కరణ సందర్భంగా విరసం, వరంగల్ యూనిట్ వేసిన కరపత్రం.)

స్పందన :

# "భూమిలేని ప్రజలకోసం ప్రజలులేని భూమి"

"చరిత్ర ఎప్పుడూ గెలుపొందిన వాళ్ళ ఆస్తి."

అందుకే పాలస్తీనా ప్రజల చరిత్రనిండా అపార్థాలూ, దుష్ప్రచారాలూ, ఒంటరి పోరాటాలూ. ఈ చరిత్ర మరుగున ఉజ్వలమైన అన్వేషణా, వీరోచితమైన పోరాటమూ దాగి ఉన్నాయి. శతాబ్దంగా సాగుతున్న ఈ యుద్ధంలో పాలస్తీనా రైతాంగం తమ భూమినీ దేశాన్నీ పోగొట్టుకొని, "శరణార్థుల జాతి"గా నెట్టివేయబడ్డారు. తర్వాతి కాలంలో గెరిల్లా విప్లవకారుల జాతిగా రూపొందిన ఈ నలభై లక్షల మంది ప్రజలు తమ పోరాట చరిత్రలోకెల్లా భయంకరమైన దశని ఇవాళ ఎదుర్కొంటున్నారు. గత జూన్ నుండి సాగుతున్న ఇజ్రాయెల్ దాడి ఈ జాతి జాతినీ హత్య చేయడానికి జరుగుతున్న ప్రయత్నం.

ఈ సంఘర్షణను యూదులకు, పాలస్తీనియన్లకు [ముస్లింలకు] మధ్య మత వైరుధ్యంగా మాత్రమే చరిత్రకారులు చిత్రిస్తూవచ్చారు. నిజానికిది పాక్షిక సత్యం కూడా కాదు. పందొమ్మిదో శతాబ్దం ఆఖరి దశలో తూర్పు యూరప్ నుండి యూదులు శరణార్థులుగా అరబ్ దేశానికి తరలి రావడంతోనే ఈ యుద్ధం ఆరంభమైంది. యూదులకు ఒక ప్రత్యేక రాజ్యం [జియోనిస్ట్ స్టేట్] ఉండాలనే భావన అప్పుడే పుట్టింది. సుమారుగా అదేసమయంలో అరబ్ ప్రజా చైతన్యంతో పాటు పాలస్తీనా జాతి చైతన్యంకూడా మేల్కొంది. 1918లో టర్కీ పతనంతో ఈ ప్రాంతాల్లో బ్రిటిష్ సామ్రాజ్యం ఏర్పడింది. అప్పటినుండి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మతం పేరుతో, యూదు రాజ్యంపేరుతో ప్రజలమధ్య ఈ సంఘర్షణకి పాలుపోసి పెంచుతూవచ్చారు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో హిట్లర్ మారణహోమాన్ని తప్పించుకున్న లక్షలాది యూదు శరణార్థులు పాలస్తీనా చేరుకోవడంతో ఈ సమస్య స్వరూపం మారింది. యుద్ధం ముగిసింతర్వాత బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఐక్యరాజ్యసమితి సహకారంతో 1948లో ఇజ్రాయెల్ రాజ్యాన్ని స్థాపించారు. ధర్మయుద్ధం, మతయుద్ధం, యూదు రాజ్యం అనే నినాదాలతో యూదులందరూ ఈ యుద్ధంలోకి నెట్టబడ్డారు. మరోవైపు అర్ధశతాబ్దం క్రితం ఐదు శాతమైనా లేని శరణార్థులు తమ ఇంట్లోనే వేరే రాజ్యాన్ని ఏర్పరచుకోవడాన్ని అరబ్బులు వ్యతిరేకించారు. ఏర్పడిన మరుక్షణంనుంచే ఆరు నెలలపాటు సాగిన యుద్ధంలో అరబ్బులు ఓడిపోయారు. ఐక్యరాజ్యసమితి సూచించిన నిర్ణీత ప్రాంతాలను దాటి ఇజ్రాయెల్ తన రాజ్యాన్ని విస్తరించుకుంది. 1921 జనాభా లెక్కలలో 90 శాతం రైతాంగం గల పాలస్తీనియన్ జాతి భూమినీ దేశాన్నీ కోల్పోయి శరణార్థులై పోవలసి వచ్చింది.

1949 ఒప్పందం యుద్ధాన్ని ఆపిందిగాని శాంతిని నెలకొల్పలేకపోయింది. పొరుగున ఉన్న అరబ్ దేశాలన్నీ ఇజ్రాయిల్‌ని గుర్తించ నిరాకరించాయి. ఈజిప్టు అధ్యక్షుడు నాజర్ సూయెజ్ కాలువను మూసేసి ఇజ్రాయిల్‌ని చక్రబంధంలో ఇరికించడానికి ప్రయత్నించడంతో 1956లో మరో యుద్ధం జరిగింది. పాలస్తీనా ప్రజలు మరోసారి దాడికి గురయ్యారు. వాళ్ళు అరబ్ దేశాలన్నిటా, ముఖ్యంగా ఈజిప్టులో శరణార్థులయ్యారు. శరణార్థులయిన ఈ రైతాంగం 1963లో పాలస్తీనా విమోచన సంస్థ [పి ఎల్ ఓ] ఏర్పాటుతో గెరిల్లా విప్లవకారులయ్యారు. తర్వాతి కాలంలో వామపక్ష పి ఎఫ్ ఎల్ ఓ, మితవాద అల్‌ఫాతా సంస్థలు కూడా ఏర్పడ్డాయి. ఐనా పి ఎల్ ఓ పాలస్తీనా ప్రజల ప్రధాన ప్రతినిధిగా ముందుకు వచ్చింది, అరబ్బు దేశాల సహకారంతో. అయితే పాలస్తీనియన్ల పోరాటానికి తమ మద్దతును ప్రకటిస్తున్న అరబ్ దేశాల పాలకులకే శరణార్థులుగా ఈ గెరిల్లా విప్లవకారులు తమ దేశాల్లో ఉండడం ఇష్టంలేదు. వారిపోరాటం తమ ప్రజల్ని చైతన్యవంతుల్ని చేస్తుందని వాళ్ళభయం. ఈజిప్ట్ నుండి జోర్డాన్‌కు చేరుకున్న పాలస్తీనియన్లు 1970లో జోర్డాన్ ప్రభుత్వం వారిపై సాగించిన మారణహోమంతో సిరియా సరిహద్దులకి చేరుకున్నారు. 1973లో మళ్ళీ చెలరేగిన అరబ్-ఇజ్రాయిల్ యుద్ధం వాళ్ళని మరో దాడికి గురిచేసింది. 1976-78 మధ్య కాలంలో జరిగిన లెబనాన్ అంతర్యుద్ధంలో ఒకవైపు ఫలాంగిస్టుల [ఇజ్రాయిల్ ప్రయోజనాల్ని కాపాడే మతవాద సాయుధ శక్తులు] దాడికి, మరోవైపు సిరియా ఒత్తిడికి పాలస్తీనియన్లు గురయ్యారు. చివరికి గత రెండు మూడు సంవత్సరాలుగా పశ్చిమ బీరూట్ [లెబనాన్ రాజధాని]లో పి ఎల్ ఓ నాయకత్వం స్థిర పడింది. ఈ మూడు దశాబ్దాల కాలంలో ముప్పైలక్షల మంది పాలస్తీనియన్లు ఇజ్రాయిలీ ఆక్రమిత ప్రాంతాలలో, అనేక అరబ్ దేశాలలో, భారతదేశంతో సహా ఇతర ప్రపంచంలో శరణార్థులుగా చెల్లాచెదురయ్యారు.

ఈలోగా పాలస్తీనా సమస్య ప్రపంచాధిపత్యం కోసం అగ్రరాజ్యాలు సాగించే ముసుగు యుద్ధంలో భాగమైంది. మనుగడకోసం సాగుతున్న ప్రజాపోరాటం అమెరికా, రష్యాల మధ్య పావులాట అయింది. ఇజ్రాయిల్‌ని అమెరికన్ పాలకులు, అరబ్బులని సోవియట్ పాలకులు సమర్థిస్తూ వచ్చారు. ఈజిప్టు అధ్యక్షుడు సాదత్ సోవియట్లను తరమడంతో అరబ్ దేశాలలో అమెరికా ప్రభావం పెరిగింది. అయితే ప్రపంచంలో అత్యధిక దేశాలు పి ఎల్ ఓ ను గుర్తించి, ఇజ్రాయిల్‌తో తమ సంబంధాలు తెగతెంపుకున్నాయి. అయినా ఈ సౌహార్ద ప్రకటనలతో ఆచరణలో

పాలస్తీనియన్లకు పెద్ద ప్రయోజనమేమీ లేకుండాపోయింది. అరబ్ దేశాల పాలకులు తమ వ్యాపార ప్రయోజనాలకి పాలస్తీనాని బలిపెట్టారు. శత్రుదాడికీ, మిత్రద్రోహానికీ గురవుతున్న పాలస్తీనియన్లపై ఇజ్రాయిల్ ప్రస్తుత మారణహోమాన్ని తలపెట్టింది. పేరుకి రెండు దేశాలు తప్ప (అమెరికా, ఇజ్రాయిల్) ప్రపంచమంతా పాలస్తీనియన్లని సమర్థిస్తున్నా వారి పోరాటం ఒంటరి పోరాటమే.

జూన్ నెలలో బీరూట్ మహానగరంపై దాడిలో ఇళ్ళూ, బళ్ళూ, ఆస్పత్రులూ, ఫాక్టరీలూ, పొలాలూ ఇజ్రాయెలీ అగ్నివర్షంలో మండి మాడి మసైపోయాయి. వేలాది పాలస్తీనియన్లు మిలిటరీ క్యాంపుల్లో బందీలయ్యారు. సలభై వేలమంది ప్రజలు మరణించారు. ఎనిమిదివేలమంది సైన్యంతో అరాఫత్ చక్రబంధంలో ఇరుక్కున్నాడు. అయినా పాలస్తీనా ప్రజల సాయుధ పోరాటం ఆగలేదు.

విదేశాలలో తాత్కాలికంగా గెలిచే అధర్మయుద్ధాన్ని ముందుగా స్వదేశంలో ఓడిపోవలసి వస్తుందని అమెరికావాడు వియత్నాంలో తెలుసుకున్నాడు. ఆ విషయాన్ని ఇవాళ ఇజ్రాయెలీ పాలకులు (రేపు సోవియట్లు) గ్రహించక తప్పదు. అందుకే ఇవాళ పాలస్తీనియన్లపై ఇజ్రాయెలీ దురాక్రమణని ఖండిస్తూ రాజధాని నగరం టెల్ అవీవ్‌లో వేలాది ఇజ్రాయెలీ ప్రజలు ప్రదర్శనలు చేస్తున్నారు. పాలస్తీనా పోరాటానికి శతాబ్దం తర్వాత యూదులు కొత్త ఊపిరినిస్తున్నారు.

చరిత్ర నిండా ఎన్ని జాతీయ విముక్తి పోరాటాలు జరగలేదు! కాని నిలబడి పోరాడడానికి తమదంటూ ఒక అడుగు భూమైనా లేకుండా పాలస్తీనియన్లు సాగిస్తున్న పోరాటం అపూర్వమైనది. ఇరవయో శతాబ్దపు ఈ విషాద వీరోచిత విముక్తిపోరాటానికి తన విప్లవాభివందనలు చెపుతూ సృజన కవిహృదయంతో గొంతు కలుపుతోంది........ ఇప్పటికీ ఎప్పటికీ పాలస్తీనా!

—'సాహితీ మిత్రులు'

## ఇప్పటికీ ఎప్పటికీ పాలస్తీనా

ఫద్వా తుఖాన్

పాలస్తీనా!
ఓ పాలస్తీనా!
వేదన నిండిన మసక రాత్రుల్లో
శోలపు గుదిబండలు

తిరుగుతూ తిరుగుతూ వుంటాయి.
కానీ
నీ వెలుగును అవి ఆర్పేయలేవు
వాటికా శక్తిలేదు
ఎందుకంటే
చితికిపోయిన నీ స్వప్నాల నుంచీ
శిలువవేయబడ్డ నీ ప్రగతి నుంచీ
దొంగిలించబడ్డ నీ నవ్వుల నుంచీ
నీ బిడ్డల చిరునవ్వుల నుంచీ
విధ్వంసన నుంచీ, హింస నుంచీ
నెత్తురంటిన గోడల నుంచీ
చావు బతుకుల ఊగిసలాటల నుంచీ
జీవం మొలకెత్తుతుంది

పాలస్తీనా ఓ పాలస్తీనా !
అద్భుతమైన భూమివి నువ్వు
లోతైన గాయానివి నువ్వు
ఏకైక ప్రేమవు నువ్వు

## ఇరవయో శతాబ్దం

సమీా అల్ కాసిం

శతాబ్దాల కింద
ద్వేషించడానికి నేసలవాటు పడలేదు
ఐనా
అలసట ఎరగకుండా
పాము మీదికి ఈటె విసురుతున్నప్పుడో
మంటల ఎదురుగా కత్తి దూస్తున్నప్పుడో
ఆ కత్తిని బాల్ ఆటవిక విగ్రహం మీదికి
గురి చేస్తున్న

ఎలిజా కావలిస్తొచ్చింది నేను *
శతాబ్దాల కింద
సమాధులు తవ్వడానికి నేనలవాటుపడలేదు
ఐనా
ఇరవయోశతాబ్దంలో
నా ప్రజలను అమ్మేసిన దేవతలను,
నా గుండెల్లోని దొంగదేవతలను
కొరడాలతో హింసించాను నేను

శతాబ్దాల కింద
నా ముంగిట్లో కొచ్చిన అతిథుల్ని
నేను వెనక్కి తిప్పికొట్టలేదు
కానీ
ఒకానొక ఉదయం కళ్ళుతెరిస్తే
నాకెంతో ప్రియమైనవన్నీ దొంగిలించబడ్డాయి
నా జీవిత సహచరి ఉరితీయబడింది
నా పసిబిడ్డల వీపులు
గాయాల పొలాలయిపోయాయి
నా అతిథులు ద్రోహులని నాకు తెలుసు
ఇక నా వాకిట్లో మందుపాతరలూ, కత్తులూ నాటాను
మిగిలిపోయిన నా కత్తితునుకలమీద
నేనివాళ ప్రతిజ్ఞ చేస్తున్నాను
ఇరవయో శతాబ్దంలో
ఈ అతిథుల్లో ఏ ఒక్కణ్ణీ
నా ఇంట్లో అడుగుపెట్టనివ్వను

శతాబ్దాల కింద
నేను యోగుల గుంపుల్లో
ఒకానొక కవిని తప్ప మరేమీకాను
కాని ఈ ఇరవయో శతాబ్దంలో
నేనో విప్లవ అగ్నిపర్వతాన్ని.

---

* బైబిల్ కథనం ప్రకారం యాపె మతాన్ని విగ్రహారాధన స్థాయికీ, ప్రకృతి ఆరాధన స్థాయికీ దిగజార్చిన బాల్‌నూ, బాలిజాన్నీ మొట్టమొదట ఖండించిన వాడూ, ఉద్యమించినవాడూ ఎలిజా.

# లాల్ బనో గులామీ ఛోడో
# బోలో వందేమాతరం

ఎస్. కె.

శిరస్సు వున్నతమని
భుజాల బరువులమీద
ఆలోచనకు కిరీటం మొలిచినపుడే
అఖండాలు ఖండాలైనవి
ప్రపంచం రెండుగా చీల్చబడ్డది
రేణువు రేణువు స్థలాల్ని
లిప్త లిప్త కాలాల్ని
పురిటి కందుల్నుంచీ పండు ముసలితనాల్ని
సమస్త సమాజాల్ని
రక్త యుద్ధం చేసింది

విరామంలేదు
విశ్రాంతి లేదు
శాంతిలేదు
నిద్రలేదు నిలకడలేదు
వున్నదంతా
వూపిరికీ వూపిరికీ మధ్య
వూపిరి సలపనంత యుద్ధం
అడవులు కొండలు మైదానాలు
జనాలు రణాలు
నేల నేలంతా పోటెత్తిన రక్త సముద్రం
ప్రకటించిందెవడు
ప్రశ్నించిందెవడు
నేను నా మాతృదేశాన్ని గురించి మాట్లాడుతున్నాను

సహజ సిద్ధమైన వనసంపద నాది
జీవనదులు ప్రవహించే గడ్డనాది

పెట్టని కోటలని వాసిగన్న కొండలు నావి
మట్టి పిసికితే గింజలు రాలే నేలనాది
అవును నిజం
నాదేశం రత్నగర్భ
ఆయితే మరి
రత్నాల కోసం గర్భాన్ని చీల్చిందెవడు
స్వార్థంగా
ఆస్తిగా
యీ నా దేశాన్ని కోరిందెవడు
నేను నా మాతృభూమి గురించి ప్రశ్నిస్తున్నాను
నేను నా మాతృభూమి కోసం ఆక్రోశిస్తున్నాను

గోడలు లేని నాడు
గోచీలు లేని నాడు
ఎల్లలుంటాయన్న ధ్యాసే లేనినాడు
అడవులు ఎవడి ఆస్తి
నదులు ఎవడి స్వంతం
సమస్త ప్రకృతీ సమస్త జనులదై వున్ననాడు
ఎవడు యజమాని ఎవడు బానిస
ఎవడు రాజు ఎవడు ప్రజ
ఎవడు పాలకుడు ఎవడు పాలితుడు

ఆదిమ మానవుని మీద పులిపంజా
ఆదిమ సమాజంమీద అడవిరంకె
ప్రకటించిందెవడు
ప్రశ్నించిందెవడు
నేను నా మాతృదేశాన్ని గురించే మాట్లాడుతున్నాను

అవసరం నూత్నసృష్టికి ఆధారమై
శ్రమై అనుభవమై

అనుభవమై శ్రమై
అల్లుకున్న జ్ఞానమైనడిచింది
శ్రమలోంచి వేదనలోంచి అలసటలోంచి
చెమటలోంచి పుట్టిన ఊర్పు శబ్దమైంది
స్వప్నాల్ని పలికిన పాటైంది
స్వప్నాల్ని మలిచిన ఆటైంది
కష్టాల్ని సుఖాల్ని
అందించి అందుకునే పాటైంది
సాహిత్యమైంది సంగీతమైంది
శ్రామిక జనకళా జీవితమైంది

మరి ఏది తలపుకొస్తే నే
ఎందుకని గుండెలవిసి పోతున్నవి
నెత్తురుడుకుతున్నది ఎందుకని
సుళ్ళు తిరుగుతున్న కన్నీళ్ళలో క్రోధంలో
ఎందుకని పేగులుండచుట్టుక పోతున్నవి
నెత్తురు కణం కణంగా తెగుతున్నది
ఎందుకని ఎందుకని ఎందుకని
శ్రమైక జీవన సౌందర్యమంతా
కాల రాచేయాలన్న విఫలయత్నమయింది
అగ్ని పాలైంది
నెత్తురు మడుగైంది
పునాదీ ఉపరితలమంతా
రక్త సిక్తమైంది
రాజుకున్న యుద్ధమైంది

ప్రకటించిందెవడు
ప్రశ్నించిందెవడు
నేను నా మాతృదేశాన్ని గురించి మాట్లాడుతున్నాను

నా దేశపు స్త్రీల సౌష్టవం
కమ్చీలతో కొలువబడ్డది
శరీరం మాంసం అంగాంగం
కర్రలతో సలాకులతో పొడవబడి
విలువకట్టబడ్డది
నా దేశపు స్త్రీల సౌందర్యం
బానిస సరుకుగా
నడిబజార్లో నిలబెట్టబడ్డది
అమ్మ బడ్డది
యజమానులకు దాసిగా
రాజులకు దేవదాసిగా
దొరలకు భోగందిగా
ఉంపుడు గత్తెగా
యీ దేశపు ఆడది
అయితే పడక గదికో
కాకుంటే పనికో
పంచుకోబడ్డ వస్తువైంది
భోగమైంది
నా దేశపు స్త్రీ
పలుపుతెంపుల గింజాటనా మృగమైంది

నా జాతీయుల బలం
ఎన్రాల్లో
కొవ్విన జంతువు కొమ్ములతో కుమ్ములాడి
ప్రదర్శనా గ్యాలరీల్లో
బానిసా బానిసా
కానియ్ కానియ్
పొడువు పొడువు అనే కేరింతల తుళ్ళింతల్లో
ప్రాణంకై పెనుగులాడి
పేగులు పోగులుగా వేళ్ళాడిన చప్పట్లలో

నెత్తుటి తప్పెట్లలో
వినోదమైపోయిన బలిపశువు
ఔను నేను నాదేశం గురించే మాట్లాడుతున్నాను

నన్ను నా నుండి
నన్ను సమాజం నుండి
నా ఇంటిని దేశం నుండి
నా దేశాన్ని ప్రపంచం నుండి
వేరుచేసి చూడలేని చూపునాది

జాతీయ దురహంకారం లేని
దేశీయ దురభిమానం కాని
ఎల్లలూ కేవల మట్టిపెల్లలూ అవని
క్రమశిక్షణా హద్దులూ సరిహద్దులూ చెరిపిన
మహోన్నత మానవతా అంతర్జాతీయత నాది
ఔను నేను నా దేశం గురించీ
నా జాతి గురించీ మాట్లాడుతున్నాను

వర్తకుల వాణిజ్యాలకు
'పెరికె'ల కాపలాలకు రవాణాలకు
కొనుగోలు అమ్మకాల వర్తకపు సరుకులు
నా దేశీయులు
బందీలుగా బానిస యుద్ధం చేసినవాళ్ళు
నా దేశీయులు

యుద్ధం ప్రకటించిందెవడు
యుద్ధాన్ని ప్రశ్నించిందెవడు

బానిసత్వం నుండే స్వేచ్ఛ పుట్టింది
యాజమాన్యం నుండే స్పార్టకస్ పుట్టాడు
ఔను నేను నా మాతృభూమి గురించే మాట్లాడుతున్నాను

సాతులకు బిడారులకు

దేశీ పరదేశీ వర్తకులకు
సముద్రయానాల మీద
గడల చుక్కానులు మా రెక్కలు
సూర్యునితో చుక్కలతో చీకటితో
పోటీపడ్డ దిక్సూచీలు మా కళ్ళు
'పుట్టి' మునిగితే
వ్యాపార సరుకులను గట్టుకు యీదిన
నీటి గుర్రాలం: మేం
నడి తుపాను సముద్రంలో సైతం
దించని లంగరులం మేం
రాజులేసిన బాటల కింద
నలిగిన యిసుక కంకర యీ దేశ ప్రజలు
రాజులు తవ్విన బావులకు
పలుగు పార తట్ట మట్టి యీ దేశ ప్రజలు
రాజులు కట్టిన
గోపురాలకు గుడులకు మసీదులకు
ప్రేమ చిహ్నాలకు
కోటలకు రాజ్యాలకు
ఇటుకరాయి యీ దేశ ప్రజలు
రాజుల తీరని యుద్ధ దాహానికి
నెత్తుటి ఏరులై పారింది యీ దేశప్రజలు
మా దేశంలో మా పేరు
బానిస సైనికుడు కూలి రైతు
మేం అనాదిగా యిచ్చింది మానం ప్రాణం
అనంతంగా దక్కించుకున్నది అనుభవం

ఓటమి నుండి గెలుపుని వేరుచేసి చూడలేని చూపుమాది
అణచివేతలోంచి పుట్టిన ప్రతిఘటన మాది
ఔను నేను నా మాతృభూమి మాటే మాట్లాడుతున్నాను
నా తల్లి నాకెప్పుడూ పేదగానే వున్నది

ఎప్పుడూ నా తల్లి నా కోసం చిక్కిశల్యమై వున్నది
నా తల్లి సస్యం ఎప్పుడూ నా గుక్కనిండా పాలు తాపలేదు
నా తల్లికష్టం ఎప్పుడూ నా కడుపునిండా గంజి తాపలేదు
మరి దాని సస్యం పొంగంతా ఎవరి పాలయింది
ఏ యినుప ముక్కుల డేగ తన కాళ్ళతో నా కడుపు తన్నింది
జ్ఞానమా బదులు పలుకు

ఎవని ఊడిగంలో నా తల్లి వెదజల్లిన చీపురైంది
శీలమా ముసుగు తీసెయ్

ఎవని ఆకలి అజీర్తులకు నా తల్లి చింపిన విస్తరైంది
నా తల్లిని తాకట్టుపెట్టి అమ్ముకున్న ఏకత
నా తల్లి సంపదకు వెలకట్టి కొనుక్కున్న ఏకత
ఏ ఏకత
తల్లి నుంచి బిడ్డన్ని వేరుచేసింది
తల్లికి తనువెల్లా సంకెళ్ళి వేసింది

ప్రశ్నించినందుకు యిక్కడ నేను 'దేశద్రోహి'ని
బానిస సంకెళ్ళను ఛేదించే ఖడ్గాన్నైనందుకు
నేనిక్కడ బందీని

నా తల్లి కష్టం తన కాయంమీద కొండరాళ్ళై కాచింది
అది మట్టై మడిగై చెమటై
నెత్తురు మడుగై సన్ను పూచింది
సన్ను కడుపుగట్టుకుని
నాతల్లి పొలాల్లో రెక్కలు ముక్కలు చేసుకున్నప్పుడు
నేను మట్టిని బుక్కాను
తన కడుపు గట్టుకుని
నాపొట్ట నింపేందుకు
భయం భయంగా బెగడు బెగడుగా

పొదలమీది కాయాకసరు ఏరి దొరికిపోయినపుడు
కాళ్ళు కడుపులు మొక్కుతూ నాతల్లి దీనంగా నిల్వడం
యిప్పటికీ నిల్చున్నచోట నన్ను నిల్వనీయదు

ఈ జనని నాది
యీ జన్మభూమి నాది
దీని కడుపు తీపంతా నాది

గాలిలో గాలై ఎడబాయని స్పర్శయి
నీటిలో నీరై ఎడతెగని సముద్రమై
నిప్పులో నిప్పయి రగిలిన బతుకై
నా కనువిప్పయి
మట్టిలో మట్టయి రక్తకేతనమై
విశ్వమంతా నాతల్లి
సమస్త విశ్వానికి నేను వారసుణ్ణి
నేను దేశభక్తుణ్ణి
నేను దేశభక్తి గీతాన్ని

రక్తం పంచిన తల్లికోసమై
రక్త తర్పణం చేస్తున్నవాడే పుత్రుడు

నేను ఈదేశ జనుల ఆదేశాన్నై మాట్లాడుతున్నాను
శ్రమైక జీవన సందేశాన్నై మాట్లాడుతున్నాను
రాజుల యుద్ధాలు చేసింది నేను
రాజుల రాజ్యాలు పెంచింది నేను
దొరల గాదెలు నింపింది నేను
దొరల పొలాలు పెంచింది నేను
ఫాక్టరీల పొగగొట్టాలెంది నేను
కట్టింది నేను పోషించింది నేను
సైనికునిగా సరిహద్దులు కాపాడింది నేను
సరిహద్దుల్ని చెరపాలని పోరాటం చేస్తున్నదీ నేను

సింహాల పులుల పంజాలు తలలూ నరికిన
ఆదిమ శక్తిని నేను
కోట బురుజుల్ని బద్దలు కొట్టిన
మందుగుండు ఫిరంగిని నేను
నీలిమందు తోటల్లో తిరుగబడ్డ
మట్టి దట్టించిన నిప్పు మందును నేను
ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాట సంగ్రామాన్ని నేను
ప్యారిస్ కమ్యూన్ని నేను
చికాగో నగరంలో చిందిన కార్మికుని రక్తాన్ని నేను
సామ్రాజ్య వాదాన్ని విల్లునేసిన
సంతాల్ తిరుగుబాటును నేను
నా సుజలాలు బ్రిటిష్ ఓడలకు దారులై
నా సుఫలాల్లో ప్రవహించే నా రక్తాన్ని పాము కాటేసి
నా సస్యశ్యామలాలు దాస్యంలో నలిగిపోతున్నప్పుడు
మలినమయిన నా శుభ్రజ్యోత్స్నల్ని
నా నెత్తుటితో కడిగేసుకునేందుకు
కత్తినయ్యింది నే
వందే మాతర నినాదాన్ని నేను
వందేమాతర నినాదం యిచ్చింది నేను

ఏమైనా
ఏ కాలంలో ఏమైనా
నేనేమైనా
నేనంతర్లీనంగా కష్టజీవిని
అనాదిగా మట్టి బిడ్డని

వందేమాతరం
వందేమాతరం

వందేమాతరం కేవల మృతప్రాయమైన నినాదం కాదు
మతవాదం కాదు

వందేమాతరం జపించే భజన మంత్రం కాదు
వినోదం కాదు
రంగుల పండుగ కాదు
వ్యక్తి సంస్కరణ కాదు
దేశభక్తి మత్తూ కాదు
విదేశీ సామ్రాజ్యవాదుల తొత్తూ కాదు
నీ సొత్తూ కాదు
నీకు నాకు మధ్య కుదిరే పొత్తూ కాదు
అది పోరాట గర్జన
అది కఠోర శస్త్రిక
స్వాతంత్ర్య సముపార్జన కోసం పడ్డ తపన

చౌరీచౌరాలో కట్టలు తెగిన రైతాంగం క్రోధానికి
బెదిరి
అస్త్ర సన్యాసానికి ఉద్యమ విరమణకు
'మహాత్ముడు' పిలుపిచ్చినపుడు
యువ విప్లవకారులు "ఆనందమఠం" నుంచి అందుకున్న
ఉత్తేజ నినాదం "వందేమాతరం"
ఈ శతాబ్దపు తొలి దశకార్థంలో
పాడిన పాట
పడ్డ పిడుగుపాటు వందేమాతరం

దీన్ని మంత్రప్రాయం చేసింది మీరు
దీన్ని భ్రష్టు పట్టించింది మీరు
దీని సారాన్ని జీవాన్ని సమరశీలాన్ని
నీరుగార్చి దారిమళ్ళించింది మీరు

వందేమాతరానికి
కొత్త మాంసాన్ని కొత్త రక్తాన్ని యిచ్చింది భగత్సింగ్
కొత్త నినాదంగా మలిచింది భగత్సింగ్

జిందాబాద్ జిందాబాద్
ఇంక్విలాబ్ జిందాబాద్

అమెరికాలో వున్నా
అమ్మ చెరవిడిపించాలని
కలలుగన్నది గదర్ పార్టీ
కదలి వచ్చింది గదర్ పార్టీ
కడలినీదింది గదర్ పార్టీ
ప్రాణాలు బలిపెట్టింది గదర్ వీరులు
అమ్మ వాళ్ళోనూ అమెరికాను కలవరించే
సామ్రాజ్యవాద దాసులు మీరు
గదర్ పార్టీ వినాదాన్ని ఈ
గడ్డమీద అందుకున్నది మేం
గళమెత్తి అరిచింది మేం
ఎదురొడ్డి పోరింది మేం
కొత్త ఊపిర్ల నూదింది మేం
కొత్తలోకాల తెరిచింది మేం

మేం
అంతర్లీనంగా కష్టజీవులం
మేం
అనాదిగా మట్టి బిడ్డలం

'స్వాతంత్ర్యం నా జన్మహక్కు' అన్నందుకు
లోకమాన్యను అండమాన్లకు పంపిస్తే
లక్షలాదిగా బొంబాయి వీధుల్లో
కార్మిక సంఘీభావాన్ని కదిలించింది మేం
సంధి చేసుకున్నది మీరు
సామ్రాజ్యవాదం చంకలో చేరింది మీరు

సముద్రం వలె పోటెత్తిన
భారత నావికా దళం మేం

మన్నె ప్రజల వెన్నలాంటి మనసుని
విల్లమ్ములుగా మలిచి
ఈ మన్ను మనదని
ఈ మన్ను పెట్టే అన్నం మనదని
మన్నెవీరుని ముందు బ్రిటిష్ సింహం
మట్టి పులి అని తేల్చిన
అల్లూరి సీతారామరాజు అందించిన ఉప్పందుకుని
ఏజెన్సీలో యిప్పటికీ రగులుతున్న
నిప్పు కణికలం మేం
ద్వారబంధాల చంద్రయ్య తెరచిన
పోరాట ద్వారాల నడచింది మేం-
కొమురం భీం రగల్ జెండాకు
సుత్తె కొడవలిని హత్తింది మేం
మార్పు పద్మనాభం గున్నమ్మలు
మేం కోరే మార్పుకు సంకేతాలు

మేం
అంతర్లీనంగా కష్టజీవులం
మేం
అనాదిగా మట్టి బిడ్డలం

వందేమాతరం
వందేమాతరం

మా రక్తాలు చిందితే యీ నేల విలపించింది
మా చిందిన రక్తంలోనే ఈ నేల పులకించింది

'బందగీ బందగీ నా బిడ్డా
ఎక్కడ తండ్రీ నువ్వెక్కడ

భుక్తి కోసం నమ్మిన భూమికోసం
సమస్తమూ అనుకున్న ఈ తల్లికోసం
తనువు చాలించిన తండ్రీ
నా పొత్తిళ్ళలో నెత్తురుగుడ్డా నువ్వెక్కడ
నీ నెత్తుటి నాగళ్ళ చారికల్ని
కట్టిన నెత్తుటి మడుగుల మడిగెల్ని
చెమర్చిన చెలిమల్ని
రక్తజలాలు పెలార్చిన పొలాల్ని
యీ చేతుల తడిమి
యీ గుండెల కదిమి
నీకు తీరైన బొట్టు దిద్దే
నీ తోబుట్టువుల పిలుస్తున్నాను
నా ఆశల బిందువా
నా కడుపు చిచ్చు తీరేదెన్నడు
నా కసిగందూ బందగీ
యిన్నూర్ల యిసునూర్ల వుసురు తీరేదెన్నడు
ఎక్కడ తండ్రీ ఎక్కడని పోల్చుకునేది నిన్ను
ఇట్లా ఎంతకాలమని ఓర్చుకునేది నన్ను'
తన చిందిన రక్తాల కోసం యీ నేల విలపించింది
రక్తాల్ని తుడిచే రక్తాల కోసం యీ తల్లి ఆహ్వానించింది

ఆ ఆహ్వానాన్ని మన్నించింది ఎవరు
ఆ ఆహ్వానాన్ని పోరాటంగా సంధించింది ఎవరు
అది నువ్వు కాదు
అది తెథాగా
అది నువ్వు కాదు
అది పునప్రావయిలార్
కయ్యూరు కామ్రేడ్స్ కంఠాలకు ఉరి బిగిసినప్పుడు
కళ్ళల్లో ఉదయించిన సూర్యులు

ఆ ఆహ్వానాన్ని అందుకున్నారు
అది నువ్వుకాదు
అది తెలంగాణా
అది కొమురయ్య ప్రాణాలొడ్డిన పథం
అది రైతాంగం చేసిన సాయుధ పోరాట శపథం
ఈ నేలతల్లి చెర విముక్తం చేసేందుకు
అది వేలాదిమంది రక్తతర్పణం చేసిన కాలం

స్వప్నాలు సాయుధాలైన కాలం
స్వప్నాలు శాస్త్రీయ త్యాగాలైన కాలం
స్వప్నాలు వర్గ దృక్పథాలై
స్వప్నాలు విప్లవాలై
శ్రామిక వర్గ పార్టీ జెండాలైన కాలం

మరి యీ కాలం కంట్లో దుమ్ముకొట్టిందెవడు
అప్పుడు నువ్వెక్కడ
నీ పాత్ర ఏమిటి

కాటూరు ఎలమర్రు గ్రామాల్లో
గాంధీ విగ్రహం చుట్టూ తల్లుల్నీ అక్కల్నీ చెల్లెళ్ళనూ
వివస్త్రలను చేసి పరిగెత్తించిందెవడు
యూనియన్ 'హిందూ' పోలీసులు చంపింది
ఏ దేశం పురుషుల్ని
చెరిచింది ఏ దేశం స్త్రీలని
ఏ చేతుల నుంచి నేలను లాక్కొని
ఏ చేతుల్లో పెట్టడానికి ఆ కుతంత్రం
మాటల గారడీతో మాయజేస్తే నమ్మని జనాన్ని
మిల్ట్రి కాళ్ళతో అణచేసి
బారుతుపాకులకు గురిచేసి ఎగరేసిన
కపోత శాంతానికి

మూడురంగుల జెండాకి కర్ర పట్టిందెవడు
రాని స్వాతంత్ర్యానికి బాణీ గట్టిందెవడు

నేను నా కాలం కడుపులోకి కళ్ళుపెట్టి చూస్తున్నవాణ్ని

నాకు స్వాతంత్ర్యం రాలేదు

నా దేశ దాస్య శృంఖలాలు యీనాటికీ తెగిపోలేదు

అందుకే
నా కలలు
నను కన్నదాని కలలు
ఎన్నికలు కావని
నా రాజకీయాలు రాజీ బేరాలు కావని
అధికారమార్పూ
బ్యాలెట్ బాక్సూ కాదని
తెలంగాణాలో ఎత్తిన బందూక్
నవాబ్ మీదికో
నా దేశం కానివాని మీదికో మాత్రమే కాదని
అది బ్రిటిష్ సామ్రాజ్యవాదినీ
ఈ దేశంలో జమీందారీనీ కూల్చడానికని
అది ఎప్పుడూ దించలేదని
దించబోనని
సమస్త రాజ్యాధికారం
శ్రామికుని హస్తగతం కావాలని
ఉత్పత్తి శక్తుల చేతుల్లోకి
ఉత్పత్తి సాధనాలు రావాలని
దున్నే వానికే భూమి కావాలని
విప్లవం వర్ధిల్లాలని
సాక్ష్యంగా

సగర్వంగా
తిరిగి నక్సల్బరీలో పేలినవాణ్ని నేను

గోచి పేలికల వాణ్ణి
తలఎత్తితే ఆకాశం వంక
దించితే అవని కడుపున తప్ప
అన్నెం పున్నెం ఎరుగని వాణ్ణి
అమాయక గిరిజనుణ్ణి

నా అన్నం కోసమే కాదు
అందరికోసం ఆయుధం అందుకున్నాను
రాజ్యాధికారం కోసం
ఆయుధం అందుకున్నాను
వసంతమేఘమై శ్రీకాకుళం చేరుకున్నాను

రంగ్ మేటియా కొండలు దాచ్చిన రక్తాన్ని చూడు
ఏనాటికీ చావని సత్యాన్ని చూడు
నిర్మల త్యాగాల్ని చూడు
'పూచిన చెట్టుకిందనే రాలిన పువ్వుల్ని' చూడు
చిగురాకుల్ని చూడు చిన్నబాబుల్ని చూడు
తేనె బతుకులో ఉప్పును
ఇప్పపూలలో నిప్పును చూడు
ఎక్కుపెట్టిన గిరిజనుడి
కనుబొమ్మల విల్లుని
పేలడానికి సిద్ధంగా వున్న
అణుగోళాల కళ్ళనీ చూడు
నక్సల్బరీ శ్రీకాకుళ కల్లోలాల్ని చూడు
కల్లోల సముద్రానికి కళ్ళు తెరిచిన
కరీంనగర్‌ను చూడు
కాలికింది ధూళిఎగసి

దొరల కంట్లో చిల్లిస దారుల్నిచూడు

ప్రజలే చరిత్ర నిర్మాతలు
సగౌరవాల గర్వాల చరిత్ర నాదేశానిది
నా దేశాన్ని చూచి నేను గర్వపడతాను
కన్నీళ్ళతో తడిసిస చరిత్ర
రక్తాలతో తడిసిన చరిత్ర
నా దేశ చరిత్ర అంతా రైతాంగ పోరాటాల చరిత్ర
రైతు బిడ్డల త్యాగాల చరిత్ర

సామ్రాజ్యవాదులూ
జాతీయ గర్వాంధులూ
భూకామందులూ
నా తల్లి ఒంటిమీద చేసిన గాయాలనే కాదు
నా తల్లి బతుకుమీద చేసిన మచ్చల్ని గూడా
నేను నా రక్తాల ధారవోతల్తో కడిగేసుకుంటాను

ఎందరెందరో మృతవీరుల ర క్త తర్పణాలు
గుర్తు చేసుకుంటాను
మైలురాళ్ళ మీద పోరాట అనుభవాలు చదువుతాను
సశాస్త్రీయ త్యాగాల దారిలో
ఎరుపునై
నూతస మానవునిగా రూపొందే తీరులో
తూరుపునై
క్రమిస్తాను

ఇవాళ ఆవులించి ఒళ్ళు విరిచిన నా ఆకాశంలో
ఇంద్రవెల్లి పాలవెల్లి
అమ్మఒడి యింకెంతమాత్రం
అశ్రుసిక్తం కావొద్దని అందిస్తున్న ఆయుధాల్లో
ఆదిలాబాద్ నా తల్లి

# పాము

భూపాల్

అమాస చీకటి. నల్లని కంటిరెప్పల తెర దించడానికి కోడికూతతో పల్లె లేస్తుంటే తూర్పుదిక్కు చెట్లమీద పక్షులు తమ పిల్లలకి ముచ్చట్లు చెబుతున్నాయి. పగలల్లా ఎండతో కాగి పొగచూరిన దేహాలకు తెల్లవారు జామున వీచేగాలి కొంత సేదదీరుస్తోంది.

ఆ అమాస చీకట్లో ఊరి ఉత్తరం అంచునుండి బండ్లబాట మీదుగా వూరికి తూర్పుదిక్కున ఉన్న సత్తిరెడ్డి బావి కొట్టంవద్ద కొచ్చి కూర్చున్నారు కొందరు స్త్రీ పురుషులు. వాళ్ళతో ముగ్గురు పిల్లలు గూడా వున్నారు. మసక చీకట్లో చెట్లింకా తమ పూర్తి ఆకారాలను సంతరించుకోలేదు. బావి మత్తడిముందున్న ఇరికి చెట్టు పక్క నుండి ఏదో ఆకారం తెల్లగా వస్తున్నట్లు వాళ్ళకు కనిపించింది.

"ఎవర్రా ఆళ్ళు" కిర్రుచెప్పుల చప్పుడుతో బాటుగా దగ్గరౌతున్న సత్తిరెడ్డి వాళ్ళను ప్రశ్నించాడు.

సత్తిరెడ్డి ఆ ఊరి పెద్ద. రోజులాగే ఈ రోజూ కాలకృత్యాలు తీర్చుకొను 'రాజువెడలె రవితేజమున' అన్నట్లు వస్తున్నాడు.

కూర్చున్న గుంపులోనుండి ఓ ముసలికంఠం "మేం ఎరుకలోల్లం బాంచను" అంది.

"గింత శీకట్లొచ్చి కూసున్నరేంరా! దొంగలా దొరలా?"

"దొంగలం గాము, దొరలమూ గాము బతుకొచ్చినోళ్ళం, కాల్మొక్త" ఆ కంఠమే మళ్ళీ అంది.

సత్తిరెడ్డి వాళ్ళకు దగ్గరగా వచ్చి చూశాడు. ఇరవై మంది వరకూ ఉన్నారు కావడిబద్దలూ, చుట్టిన చాపలూ, కర్రలు, గుడ్డమూటల్లో వంటసామాన్లూ గంపల్లో వస్తువులూ కనిపించాయి.

"ఇక్కడ మా జీతగాళ్ళెవల్లేనట్టుంద్రూ?" అంటూ కొట్టం దిక్కు చూస్తూ "అరే మల్లిగా? యాదిగా?" అని కేకేశాడు.

సమాధానం రాలేదు.

"పొద్దెక్కొస్తుంది. లంజకొడుకులొక్కరూ లేరు. బాగ పెండ్లాల దెగ్గర పండమరిగింద్రు. బాయికాడి కెందుకొస్తరూ" అంటూ నాలుగడుగులు కుడిదిక్కుగా నడిచి "ఏ ఊర్రా మీదీ" అని అడిగాడు.

"మాది ఒక ఊరా దొరా! వడమటి దేశంనుండి వదొస్తున్నం. ఏడ నాలు

గొద్దులుంటే అదే ఊరనుకుంటం. పూట గడిస్తే సాలు లేకుంటే ఇంకో ఊరు" ఒక ముసలోడు దెగ్గరగా వచ్చి చేతులు జోడించి మొక్కుతూ విన్నవించుకున్నాడు.

సత్తిరెడ్డి అతన్ని ఎగా దిగా చూసి ముందుకు నడిచాడు. దూరంగా ఏదో ఆకారం మెదిలింది. "ఎవ్వరాడూ!" కేక.

"నేనే యాదిగాన్ని"

"ఎన్ని కూతలేసిన సప్పుడు జెయ్యరేందిరా కడుమోళ్ళ ఏడసచ్చిండ్రు?"

"మోటరు నీళ్ళు వోస్తలేదు ఇద్దరం యాన్నే మర్లాడుతున్నం. ఒకడు పెండ కళ్ళు దీస్తున్నడు, ఇంకోడు సేల 'గనుమలు గట్ట వొయ్యిండు" చెప్పుకుంటూ సత్తిరెడ్డి జీతగాడు కొట్టంనుండి గ్రీసుడబ్బా తీసికెళ్ళుతూ ఓ కంట ఎరుకల వాళ్ళను చూస్తూ బావి గడ్డ వొంపులోకి మునిగాడు.

సత్తిరెడ్డి నడక వేగం హెచ్చింది. వరి మడిపైనుండి డొంకవైపు కానుగు చెట్ల వొంటి బిరబిరా నడిచాడు.

మోటరు నీళ్ళు పోసింది.

మత్తడి మురుగునీళ్ళపై వున్న చెత్తాచెదారం ఎండుటాకులు నీళ్ళతాకిడికి కదిలి కాలువలో కొట్టుకపోతున్నాయి. సత్తిరెడ్డి కానుగుపుల్లేసుకొని పండ్లు తోముకుంటూ కొట్టం వద్దకొచ్చాడు. జీతగాడొకడు కొట్టం లోపలినుండి కుర్చీ తెచ్చి వేశాడు. రెడ్డి సుఖాసీనుడయ్యాడు.

తెల్లగ తెల్లవారింది.

ఎరుకల వాళ్ళు వాళ్ళలో వాళ్ళేదో మాట్లాడుకుంటూ సత్తిరెడ్డిని చూసి నిశ్శబ్దం వహించారు.

"మీ అందరుట్ల పెద్దెవ్వరా?" సత్తిరెడ్డి

"నేను బాంచను" ఒక ముసలతను ముందుకొచ్చాడు.

"ఏం పేర్రా నీపేరు?

"పోశిగాడంటరయ్యా"

"ఏ కాల మెట్లుంటదో బిడ్డా మీ దెగ్గర బంగారం, ఎండి ఏమన్నా వుంటె ముందే నాకు జూపియ్యిండ్రా. ఊరిలేమన్న కాని పనైతె అది మీ మీదికి రాగల్ల."

"రోజుకో పూట గంజి దొరుకుడే యెటమటమైతది.బంగారమాపటేలా మమ్మ లను కోసినా దొర్కదు."

"ఆ గదే జెప్తున్న! ఇంగ పోతె ఇత్తడి స్టీలుసామాన్లు?"

"ఇత్తదేంలేదుగాని నాల్గు తలెలు, ఆరు గిలాసలు, మూడు సెంసెలు, స్టీలుయి ఉన్నయి నాయిన" కూర్చున్న చోటునుండి లేచి ముందుకొస్తూ అన్నది ఓ ముసలావిడ. ఈమె పోచయ్య భార్య.

సత్తిరెడ్డి ఆ విషయం ఇంకేమీ మాట్లాడలేదు. మరొక్కసారి వెలుతురులో అందరినీ పరికించి చూశాడు. లేచి నిలబడుతూ "మీరు ఎరుకగూడ జెప్తారె?" ఆమె నడిగాడు.

"మేం ఎరుక జెప్పం పటేలా! కుచ్చెరుకలోళ్లు ఆళ్ళు ఏరే" అంది ఆవిడ.

"మేం ఏం జేసినా తట్టలూ, బుట్టలల్లకమే జాస్తి, ఇంగ ఓ ఊరు పట్టుకుంటే గిన్ని పందులగూడ పెంచుతం కాని, సోదిజెప్పకం మాకులేదు" అన్నాడు పోచయ్య.

"ఏం తట్టలు బుట్టలో గని, శేల పొంటి ఎలుకలు పట్టే ఎర్రిగూడుంటది మీకు. మరి నా మడికట్లల్ల పొక్కలన్ని జేసి పొయ్యేరు! మడికట్లల్ల కడుగుపెట్టొద్దు. ఇప్పుడే జెప్తున్న మరి" అంటూ ఇంటి దిక్కు నడవసాగాడు.

కొంతదూరం నడిచి "అంగో ఆ కంచె మూలకు గుడిసె లేసుకోండ్రి' గట్టిగా చెప్పి "ఎవ్వడొచ్చినా నా జాయికాడికే ఒస్తడు. కాదని ఎల్లగొట్టినా ఊర్ల పొంటి పటేలు మంచోడుకాడని బద్నాం జేస్తరు లంగలంజకొడుకులు" మెల్లగా తనలో తాను గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

సత్తిరెడ్డికి కావలసినంత భూముంది. రాత్రిపగలు పదిమంది జీతగాళ్ళు చేసినా తీరని వ్యవసాయం చేయొచ్చు. కాని నల్గురు జీతగాళ్ళనే పెట్టుకున్నాడు. ఎక్కువ మందిని పెడితే తలనొప్పని అయినంతవరకే కానీ అంటూ కొన్ని సెలకలు పశువుల గడ్డికోసం వదిలేశాడు.

సాగుచేస్తే ఇంకా కంచెగూడా వుంది. రాళ్ళు రప్పలతో నిండిన బోడగుట్ట క్రింది భాగమంతా సత్తిరెడ్డి సొంతం భూమని చెప్పుకుంటాడు. ఆగుట్టనానుకొనే వున్న అరవై ఎకరాల గుడ్డం అంచునే ఎరుకలవాళ్ళు గుడిసెలేసుకున్నారు.

మధ్యాహ్నం రెండు గంటలు దాటింది. నిన్నటిరాత్రి కాచుకున్న గంజి రాత్రి తాగగా మిగిలింది. ఎవరి గుడిసె వాళ్ళా వాళ్ళ సంతానంతో తాగేశారు. మొత్తం ఏడు గుడిసెలు పడ్డాయి.

అప్పటికే గుట్టకిందివైపు వెళ్ళిన యువకుడు దయానందు భార్యతో బాటుగా కొన్ని [illegible]ర్చెరు బరిగెలు మోసుకొనివచ్చి గుడిసెలముందు వేశాడు. సత్తిరెడ్డి బావి

వైపునుండి ఒక జీతగాడు పరిగెత్తుకుంటూ రావడం చూశాడు. ఎగదమ్ముతో రొప్పుతున్నాడు "అరే పో....పోశయ్యను పఠేలు పిల్సుక రమ్మన్నడు. పఠేలు పడమటింట్ల పాము. పొక్కలకు పొయ్యింది. మొన్ననే ఒకర్ని కరిసింది. దాన్ని సంపాలె" అన్నాడు దమ్ము తీస్తూనే.

"పామును సంపేటోళ్ళేలేరా ఊళ్లె? మేమెందుకయ్యా" దయానందు అడిగాడు.

"అదికాదు, అది పొక్కలకు పొయ్యింది మీరు ఎలుకల వత్తరుగదా, దాన్ని ఎట్ల పట్టాల్నో మీకే తెలుస్తదని మీదెగ్గరికు పంపింది" అని చెబుతూ పోశయ్య దిక్కు చూశాడు అతను.

"ఎలుకలు వత్తంగాని, పాములుపట్టం. పాముల వత్తందుకు పాములోళ్ళు...." ఇంకా ఏమో చెప్పబోయాడు దయానందు. కాని, పోశయ్య మధ్యలో అందుకొని "అరే సందూ! పఠేలుతోని మనకున్న పని సంగతి తెలిసే మాట్లాడుతున్నవ్‌రా! యీతబరిగె ఇవ్వమని అడుగుదామంటివిపోదాం పా.... దాన్ని సంపొత్తే మనకే మంచిది" ఎరుకల భాషలో అంటూ వచ్చినతనితో ముందుకు నడిచాడు.

"ఆ! ఉత్తపుణ్యానికే ఇస్తడాఏంది పైసలు దీస్కోడూ?" తప్పనిసరిగా పెద్ద మనిషివెంట నడవక తప్పలేదు. కడుపులో పేగులు మండుతున్నాయ్.

దయానందు పోచయ్య తమ్ముని కొడుకు. తమ్ముడి కొడుకైనప్పటికి తనే అన్ని బరువు బాధ్యతలు మోసి నల్లగొండ జిల్లా కొండమడుగు గ్రామంనుండి పిల్లను తెచ్చి పెండ్లి చేశాడు. దయానందు పెళ్ళి జరిగి నాల్గు ఏండ్లు దాటింది. పిల్లలు లేరన్న బాధ ఒక్కటి తప్పిస్తే మరే ధ్యాస వాళ్ళకు లేదు.

పొద్దు పడమటవైపు తిరిగింది. పెళ్ళినవాళ్ళింకా రాలేదు.పుల్చేరు బరిగె గుడిసె కాత వేయగానే ఊళ్లోకి వెళ్ళి రెండురూపాయల నూకలు కొనుక్కొస్తానని చెప్పి మాటల్లోపడి అలా వెళ్ళిపోయాడు. జానమ్మ మనసంతా భర్తమీదే వుంది. మాటి మాటికీ ఊరి దిక్కుగా చూస్తూ నిలబడిపోయింది.

చీకటిపడుతుందా పెళ్ళినవాళ్ళు తిరిగివచ్చారు. కాని, దయానందు ముఖం కొంచెం వాడినట్లుగావుంది. పెదవులు ఒక మూలనుండి సన్నగా చొల్లు కార్చుకుంటున్నాడు. కళ్ళు కొంచెం మూతలు పడుతున్నాయ్. కుడిచెయ్యి అరదండాకు బిగ్గరగా ఏదో కట్టుకట్టుంది. జానమ్మ భయంతో దిగులుతో ఏమైందని ఆత్రంగా అడిగింది.

"పాము కరిసిందమ్మా మంత్రమేపిచ్చినం, ఊరిబైటికొచ్చి ఆగ్గూడ కట్టినం. నిద్రపోనియ్యకుంట సూడు. అదిగ నీసేతులుంది." అంటూ పోచయ్య "అది కరిసినా దాన్ని ఇడిసిపెట్టలే మనిషంటే ఈడే! దాన్ని సంపే ఆడికెళ్ళి కదిలిండు" గుడిసె లోనికివెళ్ళి బొంత తెచ్చి నేలమీద పరిచాడు.

జానమ్మ నెత్తిన పిడుగురాలినంత పనైంది. తనేడిస్తే భయపడతాడేమోనని అతనిముందు ధైర్యాన్ని ప్రదర్శించి గుడిసెలోకెళ్ళి వెక్కి వెక్కి ఏడ్చింది. అందరూ వచ్చి దయానందు చుట్టు చేరారు. "అయ్యో కొడుకా ఇప్పుడేం జేద్దునురో" తండ్రి ఏడుస్తున్నాడు.

దయానందును ఎన్నోసార్లు పాములు కరిచాయి, కాని, ఈ విధంగా కనిపించడం ఇదే మొదటిసారి. జానమ్మకు భయంగా వుంది. ఏడుస్తూ తన భర్త నోటి నుండి కారే చొల్లును చీరకొంగుతో తుడుస్తుంది. దయానందు తల్లి శోకం పెట్టింది. కోడలే దరిద్రపుది. కనుకనే ఇన్ని కష్టాలు కొడుకు కొచ్చాయని ఆమె ఏడుపు సారాంశం. జానమ్మ అవేవీ పట్టించుకోకుంది. మత్తుగా తెరిచే కళ్ళలోకి చూస్తూ దీనాతి దీనంగా పిలుస్తుంది భర్తని. కంటి రెప్పలమీద బరువైన వస్తువేదో పెట్టినట్లుగా ఎంతో ప్రయత్నంతో భార్యని చూడాలనుకుంటున్నాడు. ఏదో మాట్లాడాలను కుంటున్నాడేమో పెదవులమీదకు చిరునవ్వు వచ్చి మాయమైంది. రాత్రంతా కంటికి పుట్టెడు ఏడుస్తూ తన బతుకు బండరాళ్ళు చెయ్యొద్దని ముక్కోటి దేవుళ్ళకు మొక్కుకుంది.

ఆరాత్రి ఎవ్వరూ ఎంగిలి పడలేదు. నిద్రపోలేదు. తెల్లవారింది, విషం పని చేయని కారణంగానైతేనేమి, కట్టిన మందు ప్రభావంతోనైతేనేమి దయానందు బతికాడు. మధ్యాహ్నం వరకు లేచితిరిగే శక్తి వచ్చింది. సాయంత్రం వాళ్ళందరూ కూడి బావివద్దకొచ్చిన సత్తిరెడ్డిదెగ్గరకెళ్ళారు. పాము కరిచింది. కళ్ళారా చూసినా ఎలావుందని అడగలేదు.

"ఆ! ఏంరా ఇంకెన్ని రోజులుంటరూ?" అడిగాడు.

"వొచ్చి మూడురోజులన్నాగాలే ఇప్పుడే పొమ్మంటావ్పటేలా!గా కొండకింద కంచెల, మీబాయి సుట్టూరునున్న ఈతబరిగె కోసుకొని రెండ్రోజులు మీపేరుమీద గాజీ తాగుతం" పోచయ్య అడిగాడు.

"అవీటిని కంటికి రెప్పలెక్క సూసుకుంట ఎవ్వరిని ముట్టనియ్యకుండ కాపాడిన, మీకు దానం జేస్తందుకురా! గామూదేండ్లకింద పక్కూరు ఎరుకలోల్లు రెండు వందలిచ్చి కోసుకున్నారు. మల్ల ఆల్లకే ఇస్తనని మాటిచ్చిన.

"ఆశవడొ_స్తిమి కార్మొ_క్త! మాకు పుర్రసెయ్యి జూపకు. మావోడు నిన్న సస్తోడు బతికిండు. మీ పుణ్యమే అడ్డొచ్చింది. లేకుంటే ఇంకోతీరుగయ్యేది. అన్ని జూసైనా దయసేయ్యండ్రి. రూపాలియ్యమనిగాదు అన్నో ఇన్నో ఇచ్చుకుంటం" పోచయ్య తమ్ముడు మైసయ్య సత్తిరెడ్డి రెండు కాళ్ళమీదాపడి బతిమిలాడాడు.

"పామును సంపమన్నగాని దాంతోని కరిపిచ్చు కొమ్మన్నానురాసేను" సత్తిరెడ్డి లేచి ముందుకు నడిచాడు. ఐనా వాళ్ళు ఆయన్ని వదిలిపెట్టలేదు. కాళ్ళా వేళ్ళాపడి ఈతబరిగెల కోసుకోడానికి ఎలాగైతేనేం ఒప్పించారు. వంద రూపాయ లిస్తామని చెప్పారు.

రాత్రి ఎనిమిదిగంటల వేళప్పుడు ప్రతిరోజులాగే జీతగాళ్ళందరూ వెళ్ళి పోయాక ఇంటిముఖం పట్టిన సత్తిరెడ్డి పోచయ్యని పిలిచి "ఈతబరిగె కోసుకుంటే కోసుకోండ్రిగాని బాయి దిక్కు వొంగివున్న ఆ రెండుసెట్ల బరిగైతే కోయకుండ్రి. అ వీటిని ముట్టకుండ్రి" అని చెపుతూ వెళ్ళిపోయాడు.

ఎండాకాలమంతా సత్తిరెడ్డికి జీవిగంజి పోసినట్లుగా సేద దీర్చినవి ఈతచెట్లే. పొద్దు మూకగానే వచ్చి బావివద్ద కూర్చున్నాడంటే పుట్టమీది ఆరెండు ఈతచెట్ల రెండులొట్లు ఖాళీగావలసిందే. బాగా చీకటిపడ్డాక జీతగాళ్ళను "ఇల్లకుపొయి దబ్బున తినిరాండ్రి. మీరొచ్చేదానుక నేనీన్నే వుంట" అని పంపించేస్తాడు. వాళ్ళువచ్చినా రాకున్నా ఎనిమిది గంటలు అవుతున్నట్లుగా తన చేతి గడియారం చూపిస్తే ఇంటి ముఖం పట్టడం రోజువారీ కార్యక్రమం. అతను రోజూ అట్లా వాళ్ళను పంపించడం, వాళ్ళు రోజూ తమకు తీరినపుడే నిదానంగా రావడం జరుగుతుంది.

ఆ రోజు మనవాళ్ళంతా గుట్టక్రింద బరిగె కొయ్యడానికి వెళ్ళిపోయారు. స్త్రీలు ఆరుగురు సత్తిరెడ్డి బావిచుట్టూ కోస్తున్నారు. అది సరిగ్గా సత్తిరెడ్డి మందు పుచ్చుకునే సమయం. బావి అంచున ఒక మూల కొడవలితో వంగి బరిగెలందు కుంటోంది జానమ్మ. సత్తిరెడ్డి కళ్ళు జానమ్మమీద పడ్డాయి. వెనకనుండి అతను వచ్చేది ఆమె గమనించలేదు. "ఏమే" అనగానే ఉలిక్కిపడి వెనక్కిచూసింది.

"అ! భయపడకు ఏంలేదు. ఈ బావి మీదవున్న రెండు సెట్లకు బరిగె కొయ్యొద్దని మీ వోళ్ళకుజెప్పిన నీకు జెప్పినారె?" అడిగాడు మెత్తగా

"అ-జెప్పిండ్రు" ముందుకు నడుస్తూఅంది.

"నీ మొగడు మంచి గైనాడె? పాపం నా కొసం అనికి పాము గరిసె;" సక్క సానుభూతితో మరికాస్త దెగ్గరయ్యాడు.

"ఆ మంచి గైండు పటేలా" అంటూనే చిక్కచిక్కగా ఉన్న చెట్లనుండి బయట పడ్డది జానమ్మ.

అతనూ అంతే వేగంగా ఆమెను చేరుకున్నాడు "ఏపిల్లా ఆగే? నిన్ను జూస్తుంటే పాసం తావునలేదు. నీకు నూరు రూపాలిస్త. రాత్రికి నా కొట్టం కాడికిరా" అడ్డంగా నిలబడి సూటిగా అన్నాడు.

"మంచిమాటకిమానంగ పక్కకు జరుగు పటేలా! నేసనొంటిదాన్ని గాను" తప్పించుకోని వెళ్ళిపోయింది.

మిగతా స్త్రీలు దూరంనుండి ఇదంతా చూశారు. సత్తిరెడ్డి మాటలు వాళ్ళకు వినిపించలేదు. సరిగదా పరపురుషునితో మాట్లాడినందుకు జానమ్మమీద తప్పు పట్టారు. జానమ్మ ఆ సమయంలో ఎవ్వరితో మాట్లాడలేదు. కోసిన బరిగెలు కట్టలు కట్టి ఎత్తుకొని గుడిసెల వైపుకు నడిచారు. జానమ్మ అత్తవారింటి కొచ్చిన నాల్గు సంవత్సరాలలో తనకొడుక్కి సంవత్సరానికొకటిగా ప్రమాదాలు జరుగుతున్నాయని దయానందుకల్లికి గుర్తొచ్చింది. మొదలే దరిద్రపుది దీనితోటె తనకొడుకు ప్రమాదాలకు లోనౌతున్నాడు. పోయినేడు పచ్చికుక్క కరిసింది, అంతకు ముందటేడు వరదల్లో కొట్టుకు పోయినోడు వారం రోజులకు తిరిగొచ్చాడు. అంతకుముందు పెళ్ళి జరిగిన కొత్తలో పాము కరిచింది. అంతా దీనితోనే వుందని దీన్ని కులంనుండి వెలేయాలని అంది. గుడిసెల కందరూవచ్చాక జానమ్మ పరపురుషునితో మాట్లాడిందని అది కులానికే తలవంపులని కులంనుండి వెలేయాలని మిగతాస్త్రీలు ప్రతిపాదించారు. కులంనుండి వెలేయకూడదంటే ఆ అమ్మాయి తల్లిదండ్రులు కులం కట్టుగా అపరాధం ముప్పు చెల్లించి మళ్ళీ కాపురానికి పంపాలి. జానమ్మ తప్పుచేయకున్నా కులం-కులం పెద్దలు తప్పుచేశావని వొప్పించి తల్లిదండ్రుల దగ్గరకు పంపించ జూస్తున్నారు. జానమ్మ అపరాధా లేక నిరపరాధా అన్నవిషయం కేవలం దయానందు గమనించగలుగుతున్నాడు. ఆధారం లేని తప్పుని సహించలేక........

"అది తప్పుజేసినా ఒప్పుజేసినా నాపెండ్లాం. నేనేలుకుంటా. మీకులం కట్టడి అన్నపేరుతోటి తప్పుజేయనోళ్ళ నెందర్ని ఎన్ని బాధలు పెడుతుండ్రు నేను జూస్త నేవున్న. నిజంగా అది తప్పుజేసిందని మీకందరికి అనిపిస్తే పొద్దటికి కడాయి పెట్టుండ్రి. దాన్ని తల్లిగారింటికి పంపియ్య. ఇంగో పటుండ్రి ఏడురూపాయలు రేపు

పొద్దూకి కల్లుకుండ దెప్పిస్త" ఏడురూపాయలిచ్చి కోపంతో అక్కడినుండి లేచి వెళ్ళిపోయాడు అప్పటికే చాలా రాత్రైంది.

మరునాడు ఉదయం జానమ్మకు స్నానం చేయించి తడిబట్టలతో కొత్తపొయ్యి వేయించారు. కొత్తకుండ కొబ్బరికాయ పగ్గేరా వచ్చాయి. పొయ్యిమీద కడాయితో సలసల మసలే నూనెలో చెయ్యిపెట్టించి కులం కట్టడినుండి విముక్తి గావించారు.

ఈ వార్త సత్తిరెడ్డి జీతగాళ్ళద్వారా ఆనోటా ఆనోటా ఊరంతాపాకింది. సత్తిరెడ్డంటే గిట్టనివాళ్ళు కొందరు పనిగట్టుకొని ప్రచారంచేశారు. సత్తిరెడ్డికి పని కాకుండానే అపఖ్యాతి పాలయ్యాననే అన్నకక్ష గూడు కట్టుకుంది. కోపం ఒకవైపున బుస కొడుతున్నా ఎంతో శాంతంగా ప్రయత్నం చేస్తున్నాడు.

దయానందు అపరాధం చెల్లించాడు. ఏ ఊరోవెళ్ళి డబ్బుతెచ్చి ఉన్న ఇరవై మందికీ కల్లూ, మాంసంతో భోజనాలు పెట్టించాడు. తాను పైకిఎలా వున్నా గుండె నిండా మంటలు లేస్తున్నాయి. కులపెద్దల మీద అసహ్యం, సత్తిరెడ్డి ప్రవర్తన అతన్ని సతమతం చేస్తున్నాయి.

ఆ రోజు రాత్రే సత్తిరెడ్డి ఇంటి పక్క ఇల్లు సోమిరెడ్డి ఇంట్లో దొంగలు పడ్డారు. డబ్బు కొంతపోయింది. నగానట్రాపోలేదు. కొంత స్టీలు సామగ్రి పోయింది. ఉదయం పంచాయితీలో ఊరందరినీ పిలిపించారు, ఎరుకలవాళ్ళనూ పిలిచారు. పోలీ సొచ్చింది. ఎరుకల వాళ్ళదగ్గర సోమిరెడ్డి చెప్పినట్లుగానే నాల్గు తపెలు, ఆరు గిలా సులు, మూడు సెంసెలు దొరికాయి. పోలీసులు వాటిని స్వాధీనం చేసుకొని సోమి రెడ్డికి అప్పజెప్పారు. ఎరుకల వాళ్ళమీద కేసు పెట్టనివ్వలేదు సత్తిరెడ్డి. సత్తిరెడ్డి ప్రోద్బలంతో వాళ్ళను చితగ్గొట్టారు. యువకులకు నెత్తుర్లు చిమ్మాయి, ముసలివాళ్ళ మోకాళ్ళు, మోచేతులు లేవకుండా చేశారు. తనమీద అపనింద పడేసిందని జానమ్మని గుడ్డలిడిసి కొట్టాలని సత్తిరెడ్డి హుకుం జారీ చేశాడు. ఎరుకల వాళ్ళంతా గొల్లున ఏడ్చి కనిపించిన ఊరి పెద్దలందరి కాళ్ళు పట్టుకున్నారు. గుడ్డలు లాగేయడం తప్పిందికాని దెబ్బలు తప్పలేదు. చివరికి ఊరిడిసి వెళ్ళిపొమ్మన్నారు.

'ఈత బరిగెను మాత్రం తీసుకెళ్ళొద్దు. మీ రిచ్చిన వంద రూపాయలకు అన్ని కట్టల బరిగె దేశం మొత్తం మీద వెదికినా దొరకదు. బరిగె సొంతం బావికాడి కొట్టం దగ్గరవేసి పోండి' అని సత్తిరెడ్డి గట్టిగా కోపంతో చెప్పాడు. ఎరుకలవాళ్ళకు ఎటూ తోచలేదు. బాధతో మూల్గుతూ మక్కుతూ పోచయ్య ఇది ధర్మం కాదనీ, దయచేసి

మా బతుకు మమ్ముల బతకనీయమనీ వేడుకున్నాడు. వంద రూపాయలకు ఎంత బరిగె ఇవ్వదలిస్తే అంత ఇచ్చేస్తే వెళ్ళిపోతామని బతిమాలాడు. కానీ సత్తిరెడ్డి ఏమీ మాట్లాడకుండా మౌనం వహించాడు.

బాగా చీకట్లు పడుతున్న సమయం. ఒకరిద్దరు ఆడవాళ్ళు గుడిసెల ముందు మూడు రాళ్ళమీద కుండలుపెట్టి ఎంతకూ రాజుకోని పొయ్యి ఊదుతున్నారు. పొగకు కళ్ళు మంటలేస్తుంటే కళ్ళగుండా నీళ్ళు కారుతున్నాయి. దూరంగా గుంపుగా కూర్చున్న పురుషులందరిలో దయానందు లేచి నిలబడి చెయ్యినట్లూ ఇటూ ఊపుతూ ఏదో చెబుతు నాల్గడుగులు నడిచి పట్టుగోల తీసుకొని వాళ్ళలో వున్న పన్నెండు సం॥రాల పిల్లవాడ్ని వెంటపెట్టుకొని చీకట్లో కలిసి పరుగుదీశాడు.

మరునాడు పచ్చిగా పుండ్లయిపోయిన దేహాలతో ఎలాగో మూటాముళ్ళే సర్దుకుంటున్నారు. మధ్యాహ్నం వేళప్పుడు సత్తిరెడ్డి జీతగాడు వచ్చి చూసి "మీరింకా పోలేదా పటేలు చూసి రమ్మన్నాడు" అంటూ తిరిగి వెళ్ళిపోయాడు.

సాయంత్రం వరకూ ఎరుకలవాళ్ళు బట్టాబుట్టాతో అంతా సర్దుకుని వెళ్ళడానికి సిద్ధమయ్యారు. పశువుల మందల, గొర్లమందల అరుపులు వినిపిస్తున్నాయి. పొద్దంతా నడుములు వంచి నాట్లేసిన ఆడపడుచులు ఇళ్ళకు ఆసికాలాడకుంటూ వెళుతున్నారు. వాళ్ళలో వున్న వయసుమళ్ళిన కూలీలు వెనకబాటుగా నడుస్తూ సత్తిరెడ్డి బావి మీదుగా వెళుతున్నారు. "పాపం అన్యాయంగా ఈళ్ళను కొట్టి సంపిరి" అని ఒకావిడంటే "ఆనికి పొయ్యేకాలమొచ్చింది బక్కలేక పొట్ట సేతపట్టుకొని ఒచ్చినోళ్ళను గోస ఉచ్చుకునె" మరొకామె మాట్లాడుకుంటూ బాటసాగుతున్నారు.

నిన్నరాత్రి జరిగిన మహాకార్యానికి ఆనందంతో సత్తిరెడ్డి ఇంట్లో విందు జరిగింది. ఉదయమే ప్రారంభమైన విందు తతంగం ఇప్పపూల సారాతో మధ్యాహ్నం దాటాక ముగిసింది. పోలీసులు వెళ్ళిపోయారు. సత్తిరెడ్డి మత్తింకా వదల్లేదు. ఐనా ఇంకా తాగాలని కోరికగా వుంది. కానీ సారా ఐపోయింది. వెంటనే పక్కూరికెళ్ళి తెమ్మని ఒక జీతగాన్ని పంపాడు. "పొద్దూకి పొయ్యింది ఇంకేం తాగుతరు ఇంక పూకుంటె గాదా?" అని భార్య అంటున్నా వినకుండా జీతగాణ్ని తిట్టి మరీ పంపించాడు.

సారాకని వెళ్ళిన వాడల్లా పదినిమిషాల్లో తిరిగొచ్చి "పటేలా రాపోలు, దొండ గూడెంల ఉన్న ఎరుకలోళ్ళు పిల్లాజెల్లా అందరూ కలిసొస్తుండ్రు. నేను బీరప్ప బండకాడికెల్లి జూసి వురికొచ్చిన" అని చెప్పాడు.

"ఆ!! ఒస్తే ఏందిరా మరి, నీకెందుకు భయమైంది?" అడిగాడు సత్తిరెడ్డి.

"పోలీసులేమొ ఎల్లిపోయిరి ఆళ్ళందరొచ్చి మనమీద పడితే?"

"మనమీదెందుకు పడ్తర్రా ఎర్రిలంజకొడకా. ఆళ్ళల్ల మనకు దెల్వనోళ్లన్నరా?" సత్తిరెడ్డి అంటున్నాడు కాని లోపలేదో భయం చోటుచేసుకుంటూనే వుంది. "నువ్వు బాయికాడికి పొయి ఆళ్ళింకా వున్నరేమో సూసిరా పో" అని పంపించాడు.

జీతగాడు బయటికి నడిచాడు. ఇంకా పూర్తి చీకటి పడలేదు. ఊరికి నాల్గు వైపుల నుండి ఎంతో మంది ఎరుకలోళ్ళు సత్తిరెడ్డి బావివద్ద నున్న గుడిసెల దిక్కు వెళుతున్నారు. పొలాల్లో పనిచేసి వస్తున్న వాళ్ళందరూ వాళ్ళను ఒక కంట చూస్తూ ఏదో జరుగబోతుందని అనుకుంటున్నారు గానీ, "ఎందుకొచ్చిండ్రా మీరందరూ ఈ వూరికి!" అని అడిగే ధైర్యం చాలకుంది. ఎరుకలవాళ్ళు వాళ్ళలో వాళ్ళేదో మాట్లాడుకుంటూ ఎవరన్నా తమను గమనిస్తున్నప్పుడు మౌనం వహిస్తున్నారు. సుమారు వంద మంది అక్కడ గుమిగూడారు.

పోచయ్య మూల్గుతూ మెల్లగా లేచి నిలబడి "మిమ్ముల నంతా జూస్తుంటే ఇంతమంది నా సావుగ్గూడారారని ఏస్తుంది. ఇంత మంది ఈడ గూడిండ్రు. మన కులానికి ఒక మంత్రం లేదు, తంత్రం లేదు, రాతలేదు. ఎండ్ల గింతలేని కులం మనది. పేగులుండగట్టుకొని వూరూరు తిరుక్కుంట బతికెటోళ్ళం. ఒకర్ని ముంచే గునం, దొంగతనం మనకులేదు." ముసలోని గొంతు జీరపొయ్యింది. "చెయ్యని తప్పు జేసిందని ఆడిగద్ద, ముందుగాళ్ళ అడిగి తెల్సుకొని మాతాన ఉన్న సామాన్లే పొయినయని దొంగతనం బెట్టి సావదన్నిండ్రు" ఇంకా ఏమో చెప్పబోతున్నాడు.

"ఆడుమల్ల తప్పెత్తడు. పోదాం పదండ్రి అడుగుదాం" ఒక నడివయసు ఆడమనిషంది.

"ఓరి ముసలోడ మాకన్ని ముచ్చట్లు దెలిసే వొచ్చినంరా. పాండ్రి ఆడికి పొయ్యే అడుగుదాం." మరోవ్యక్తి కేకేశాడు గుంపు మధ్యనుండి.

జనమంతా కదిలారు. దయానందు అందరికి ముందు నిల్చి "అగుండ్రి అగ జూడుండ్రి. సేను కింద కట్ట పొంటి ఎవరో అంతజూస్తుండ్రు. పది మందిని పెట్టి ఆడు మనను కొట్టించినా కొట్టిస్తడు. బద్రంగుండాలె. అందరు కట్టెలు దీస్కోండ్రి" అన్నాడు.

దూరంగా కదులుతున్న ఆకారాలు మరి కనిపించలేదు. ఊరి మధ్యకు ఎరుకలవాళ్ళ గుంపు ఎళ్ళిందో లేదో ఇద్దరు సత్తిరెడ్డి జీతగాళ్ళు ఎదురయ్యారు. "మీ బరిగె మీరు తిస్కోని పొమ్మంటుండు పటేలు" అని చెప్పారు.

"బరిగెనే కాదు. మమ్ముల నెందుకు కొట్టిండో కూడ చెప్పాలె.... అన్నట్టి గిడ్సిపెట్టాం?" ఎవరో యువకుడు.

ఎరుకలవాళ్ళ చేతుల్లో వున్న కొడవళ్ళూ, కర్రలూ చూసి ఎక్కడి జనం అక్కడ బిక్కుబిక్కున, చాటుమాటుగా చూస్తున్నారు గానీ, ముందుకొచ్చి ప్రశ్నించే ధైర్యం చేయలేదు. అందరు చూస్తుండగానే సత్తిరెడ్డి మిద్దె వద్దకు చేరుకున్నారు.

ఎవరో ఆడమనిషి తలుపు దగ్గరకొచ్చి "లేడు పటేలింట్ల లేడు" అంటూ తలుపేయ బోయింది.

"లేడో వున్నడో మాకు చెల్సు, తలుపు దియ్యి" ఒక్క తన్నుదన్నాడు దయానందు. తలుపు పెద్ద చప్పుడుతో గోడలకు తాకింది. "ఇంగేం జేతుంరో నాయనో సంపెటట్లున్నరో కొడుకో" లోపలినుంచి ఆడవాళ్ళ ఏడుపు. అప్పటికే కొందరు ఎరుకలవాళ్ళు లోపలికి వొచ్చేశారు. "ఏడి? ఎక్కడసాయె? పట్టుకోండ్రి" అరుపులు. "ఎన్నిరోజు లాత్తడు నాటకాలు తన్నుండ్రి."

సత్తిరెడ్డి మిద్దెపైకెక్కాడు. చుట్టు పక్కలున్న రెడ్లను కేకేశాడు. కానీ ఎవ్వరూ మారు పలకలేదు. తప్పించుకునే మార్గమూ లేదు. మాటవిన్న ఎరుకలవాళ్ళు మిద్దెక్కసాగారు. చంపేస్తారు, వీళ్ళ చేతుల్లో తన చావు తప్పదనిపించింది. వెనక వైపు నుండి ధైర్యంచేసి కిందకు దూకేశాడు. ఇల్లంతా గాలించాక, ఇంటి వెనకనుండి వినిపించే ఏడ్పులో "సత్తిరా నాయనో" అనే మాట వినిపించింది. సత్తిరెడ్డి రెండు కాళ్ళూ విరిగి పోయాయి. తలకు బలమైన గాయం తగిలింది. వచ్చినవారి అరుపులు, కేకలు మెల్లమెల్లగా తగ్గిపోయాయి. ఆ మిద్దె చుట్టున్న ఇండ్ల తలుపులు తెరుచుకోలేదు. ఎరుకలవాళ్ళు వెళ్లిపోతుంటే కొందరు రైతుకూలి జనం "ఏమైంది మీ పంచాది ఎంత కొచ్చింది" అని అడిగారు. వాళ్ళు జవాబు పెద్దగా చెప్పకుండా "ఆడు మా ముంగటి కొచ్చినాడు?" అంటూ వెళ్ళిపోయారు. తెల్లవారింది. ఎరుకల గుడిసెలు లేవు. ఈత బరిగె లేదు. ఊరు ప్రశాంతంగా వుంది. "సత్తిరెడ్డి బతికెటట్టు లేడంట" అని అందరూ అనుకుంటున్నారు.

# పాలస్తీనా ప్రజాపోరాటం

కె. బాలగోపాల్

ఇజ్రాయిల్ ఏర్పడి ఇప్పటికి 34 సంవత్సరాలు గడిచాయి. ఈ 34 ఏండ్లలో ఇజ్రాయిల్ పేరు దినపత్రికల శీర్షికల్లో కనబడని రోజు లేదంటే అతిశయోక్తే గాని, మరీ అన్యాయమయిన అతిశయోక్తి కాదు. ఒకరోజు ఇజ్రాయిల్ దౌర్జన్యం, రెండవ రోజు పాలస్తీనా ప్రజల ప్రతిఘటన, మూడవరోజు ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ ఖండన, నాలుగవరోజు సెక్యూరిటీ కౌన్సిల్‌లో అమెరికా వీటో, అయిదవ రోజు ఏ కొలంబోలోనో కొత్తఢిల్లీలోనో సమావేశమయిన అలీనదేశాల అధినేతల కృత్రిమ సంతాపం, మళ్ళీ ఆరవరోజు కథ పునఃప్రారంభం—ఇదీవరస. ఈ ఇతిహాసపు నూతన ఘట్టం గత కొద్దివారాలుగా లెబనాన్‌లో సాగుతోంది. బహుశా కొద్ది రోజులలో ఎప్పటిలాగే మరింతమంది పాలస్తీనా అరబ్బుల దారుణ మరణంతో ముగుస్తుంది. మళ్ళీ తెరలేచేదాకా పాలస్తీనా ప్రజలకు శవాలను లెక్కపెట్టుకోవడానికి విరామం.

ఎప్పుడో 4 వేల ఏండ్ల క్రితం, ఇజ్రాయిల్ అన్నది ఒకదేశంగాని జాతిగాని కాకుండ కొన్ని పశ్చిమ ఆసియా తెగలకు సామాన్య వ్యవహారంగావున్న రోజులలో, యెహోవా అబ్రహాంకు కలలోనో పగటి పూటేనో కనిపించి పాలస్తీనాను తాను యుదులకు (Jews) దత్తం చేసాననీ, తన వాక్కును ప్రచారం చేసేందుకు తాను యూదులనే ఎంచుకున్నాననీ అన్నాడట. ఇన్ని శతాబ్దాలు గడిచినా యెహోవా తన వాగ్దానాన్ని నిలుపుకునేలాగ లేదు కాబట్టి, దాన్ని తామే సాధించుకోవాలని నిర్ణయించుకున్నారట. అప్పటికే పాలస్తీనాలో వేల సంవత్సరాలుగా వుంటూ వస్తూన్న అరబ్బులకు ఎంత కష్టం కలిగించినా ఆ నిర్ణయాన్ని ఉపసంహరించుకునేది లేదట. నిజానికి అక్కడున్న అరబ్బుల ఉనికినే తాము గుర్తించ దల్చుకోలేదు. యూరప్ నలుమూలల నుండి 1882లో మొదలుపెట్టి లక్షలసంఖ్యలో పాలస్తీనాకు వలస వెళ్ళిన యూదులు తమ ప్రయత్నాన్ని 'ప్రజలులేని దేశాన్ని దేశంలేనిప్రజలకు సప్పజెప్పడం' గా వర్ణించుకున్నారు (To give a land without a people to a people w thout a land). తాము దేశంలేని ప్రజలనీ, పాలస్తీనా ప్రజలులేని దేశమనీ, వాళ్ళ అభిప్రాయం. అయితే ఒక సోవియట్ రచయిత అన్నట్టు, అప్పటికి యూదులు దేశంలేని ప్రజలూ కారు, పాలస్తీనా ప్రజలులేని దేశమూకాదు. 1919లో పాలస్తీనా జనాభా 5,90,000. అందులో 5,33,000 మంది అరబ్బులు. యూదులు గూడ 'దేశంలేని ప్రజలు' కాక, యూరప్‌లోని వివిధ దేశాలలో ఇమిడిపోయి వున్నారు.

పశ్చిమ యూరప్‌లోని యూదులు ఆయాదేశాల భాషలే తప్ప (ఇంగ్లీష్, ఫ్రెంచి ఇత్యాది) తమ పవిత్రభాషగా పరిగణించబడే హీబ్రూ మాట్లాడడం గూడ మరచి పోయారు. తూర్పు యూరప్‌లోని యూదులు గూడ యిద్దిష్ (Yiddish) అనే భాష మాట్లాడేవారు, హీబ్రూకాదు. ఈ వాస్తవాలనన్నింటినీ పక్కకుపెట్టి, పాలస్తీనాలో నివసించడం తమ పవిత్ర హక్కుగా ప్రకటించుకొని 19వ శతాబ్దం చివరి భాగం నుండి పాలస్తీనాకు వలసవెళ్ళడం మొదలుపెట్టి క్రమంగా అక్కడి అరబ్బులను సంఖ్యలో మించిపోయి, అంతర్జాతీయ అభిప్రాయాన్నీ · ఐక్యరాజ్యసమితి నిర్ణయాన్నీ ఉల్లంఘించి బలప్రయోగంతోను, యుక్తిప్రయోగంతోను, సామ్రాజ్యవాద సహకారం తోను, 1948లో ఇజ్రాయెల్‌ను ప్రకటించుకున్నారు. ఈ యూదుల దాడికి తట్టుకో లేక పాలస్తీనా అరబ్బులలో చాలామంది పక్కదేశాలయిన జోర్డాన్, లెబనాన్, సిరియా, ఈజిప్టు, తదితర దేశాలకు శరణార్థులుగా పోయి ఈ 34 సంవత్సరాలుగా శరణార్థుల క్యాంపులలో జీవిస్తున్నారు. అయినా తమ మాతృభూమికి తిరిగి వెళ్ళాలన్న తమ పట్టుదలను విడిచిపెట్టకుండా ఎన్ని దెబ్బలకయినా తట్టుకొని పోరాటం చేస్తున్నారు. శత్రువుది సామ్రాజ్యవాద బలం అయితే తమది పరాధీనుల బలహీనత. పక్క దేశంలో తలదాచుకుని పోరాటం చేయడం అన్నది చరిత్రలోకి పాలస్తీనా ప్రజలతోనే వచ్చింది. కాళ్ళ క్రింద నేల ఉంటే నిలదొక్కుకుని పోరాటం చేయవచ్చునని చైనా, వియత్నాం ప్రజలు చూపించారు. కాని కాళ్ళక్రింద నేలకోసమే పోరాటమయితే దిక్కేది?

0 0 0

యూదులు అనేది ఒక మానవసమూహం (human community). దాన్ని నిర్వచించేది జూడాయిజం (Judaism) అనే మతం, ఆ మతసంస్కృతి, క్రైస్తవ యూరప్‌లో అల్పసంఖ్యాక జాతిగాను, ఫ్యూడల్ పట్టణప్రాంత వ్యాపారస్తుల వర్గం గాను కొన్ని శతాబ్దాల మనుగడ తాలూకు చరిత్ర. హీబ్రూ వాళ్ళ పవిత్రభాషేగాని వ్యావహారిక భాష కాదు. హిందువులకు సంస్కృతం లాంటిది యూదులకు హీబ్రూ. 'జాతి'ని నిర్వచించే లక్షణాలలో ప్రాదేశికత్వం ప్రధానం కాదనుకుంటే యూదులను ఒక జాతి అనవచ్చు.

అరబ్బులను ఒక 'జాతి' అనడంలో ఇంకా ఎక్కువ ఇబ్బందులున్నాయి. వాళ్ళకు ఒకే మతం గూడ లేదు. ముఖ్యంగా, ఇవ్వాళ వార్తల్లో వున్న పాలస్తీనా,

లెబనాన్‌లలోని అరబ్బులలో ముస్లింలతో సమానంగా కాకున్నా గణనీయమైన సంఖ్యలో క్రైస్తవులున్నారు. అయితే వాళ్ళకూ అరబిక్ భాష, ఎడారి సంచారజీవుల నాగరికత సామాన్య లక్షణాలు. ఆ భాష గూడ, పశ్చిమాన మొరాకోతో మొదలు పెట్టి అల్జీరియా, ట్యునీషియా, లిబియా, సౌదీఅరేబియా, పాలస్తీనా, జోర్డాన్, లెబనాన్, సిరియాలగుండా తూర్పున ఇరాక్‌కు వచ్చేసరికి గుర్తుతెలియనంతగా మారి పోతుంది.

అరబ్బులూ యూదులూ దగ్గరి చుట్టాలు. ఇద్దరూ సెమిటిక్ race కు చెందు తారు. ప్రాచీనకాలంలో ఇద్దరూగూడ పశ్చిమ ఆసియా ఎడార్లలోని సంచారజీవులే. పశుపోషణ, వాణిజ్యం, ఒయాసిస్‌లలో చిల్లర వ్యవసాయం. వాళ్ళ జీవనాధారాలు. అప్పటికి అరబ్బులకు ఒక మతం లేదు; యూదుల జూడాయిజం మాత్రం చాలా ప్రాచీనమయినది. వాళ్ళమూలపురుషుడిగా పరిగణించబడే అబ్రహాం క్రీ.పూ. 2000 కాలానికి చెందినవాడని చరిత్రకారుల అంచనా.

క్రైస్తవం పుట్టుక వల్ల జూడాయిజం వెంటనే బలహీన పడలేదుగాని, క్రీ.శ. 135 సంవత్సరంలో రోమన్ చక్రవర్తికి వ్యతిరేకంగా జరిగిన ఒకానొక తిరుగు బాటులో కొందరు యూదులు పాల్గొన్నందుకు వాళ్ళమీద కోపంతో రోమన్ చక్రవర్తి యూదుల పవిత్ర నగరమయిన జెరూసలెంలోని వాళ్ళ దేవాలయాన్ని నాశనంచేశాడు. దానితో యూదులు చెల్లా చెదురయిపోయారు. అధిక సంఖ్యాకులు క్రమంగా యూరప్ ఖండమంతా వ్యాపించిపోయారు. రోమన్ సామ్రాజ్యపతనం తరువాత యూరప్‌లో ఆవిర్భవించిన ఫ్యూడల్ సమాజంలో యూదులకు వ్యాపారస్తులుగా అనువయిన స్థలం దొరికింది.

దానికొకకారణం వుంది. సంచారజీవులయిన యూదులకు (అరబ్బులకు గూడ) వాణిజ్యం కొత్తకాదు.ఎడారి ఒకచివర సరుకులుకొని కారవాన్లపై (caravans) రెండవ చివరికి తరలించి అక్కడ విక్రయించి తమ జీవనాన్ని సంపాదించుకునే అలవాటు వాళ్ళకు ప్రాచీనకాలంనుండి వుంది. వాణిజ్యాన్నీ వాణిజ్యలాభాన్నీ జూడా యిజంగాని ఇస్లాంగాని చిన్నచూపు చూడవు. ఫ్యూడల్ మతమయిన క్రైస్తవం అట్లా కాదు. క్రైస్తవం ఈ ప్రపంచాన్ని పాపపంకిలమయినదిగాను, ఈ ప్రపంచంలోని సకల పాపపు వ్యాపకాలలోనికీ వ్యాపారం మరీ అధమమయినదిగాను పరిగణిస్తుంది. ఈ కారణంచేత క్రైస్తవులెవ్వరూ వ్యాపారం చేపట్టలేదంటే అసత్యమవుతుందిగాని,

క్రైస్తవులకంటే యూదులకు అది సులభమయింది. ముఖ్యంగా వడ్డీవ్యాపారం క్రైస్తవులకు పూర్తిగా నిషిద్ధం కాబట్టి అది యూదులకు గుత్త అయింది.

ఈ రకంగా మధ్యయుగాలనాటికి యూదులు యూరప్ దేశాలలో పట్టణప్రాంత వ్యాపారవర్గంలోను, దిగువ మధ్యతరగతిలోను స్థిరపడిపోయారు. గ్రామీణ ప్రాంతాలలో యూదులు చాల తక్కువ. వాళ్ళకు వ్యవసాయిక పూర్వరంగం లేకపోవడం దీనికి కారణం.

మధ్యయుగాల చివరిభాగంలో బూర్జువా విప్లవాలు రావడంతో పట్టణప్రాంతాలలోని యూదులు మొట్టమొదట ప్రభావితులయ్యారు. వాళ్ళలోని వ్యాపారస్తులు మరింత బాగుపడి ఆధునిక పెట్టుబడిదార్లయితే, దిగువ మధ్యతరగతికి చెందినవారు మరింత దిగజారి కార్మికులో లుంపెన్ కార్మికులో అయ్యారు. ఏదేమయినా ఆధునిక భావాలు, జీవన విధానం యూదులను త్వరలోనే తాకాయి. పాశ్చాత్యదేశాల బూర్జువా సంస్కృతినుండి పుట్టిన మహామేధావులయిన యూదుల జాబితా చాలా పెద్దదిగాని, అందులో అందరికీ తెలిసిన పేర్లు మార్క్స్, ఫ్రాయిడ్, ఐన్‌స్టీన్. 19వ శతాబ్దపు బూర్జువా ఉదారవాదంచేత ప్రభావితులయిన పశ్చిమ యూరప్ యూదులు ఆయాదేశాల ఆధునిక సమాజంలో భాగమయిపోయారు. కాని బూర్జువా విప్లవాలు ఆలస్యంగా జరిగిన తూర్పుదేశాలలో అట్లా జరగలేదు. తూర్పు యూరప్‌దేశాలు రష్యా సామ్రాజ్యం చేత అణచబడటంచేత, చాలా వెనకబడి ఉండడం చేత, అక్కడి ప్రజలు విపరీతమయిన పీడనకు గురయ్యారు. వ్యవస్థ పట్ల తమకున్న అసంతృప్తిని యూదులమీద చూపించుకున్నారు. దీనికి యూదులలో చాలామంది వ్యాపారస్తులు, ముఖ్యంగా వడ్డీ వ్యాపారస్తులు కావడం ఒక కారణం. క్రీస్తును శిలువవేసి చంపింది యూదులేనన్న మతపరమయిన ఆరోపణ మరొక కారణం. ఈ కారణాలన్నిటివల్లా యూదువ్యతిరేకత (anti-semitism) బలపడి యూదులను సామూహిక మారణకాండకు గురి చేయడం తరచుజరిగేది.

ఈ పరిస్థితులలో తూర్పు యూరప్‌లోను రష్యాలోను యూదుల జాతీయ తత్వానికి అనుకూలమయిన వాతావరణం ఏర్పడింది. అక్కడి యూదులు అలనాడు అబ్రహాంకు యెహోవా ఇచ్చిన వాగ్దానాన్ని మరచిపోలేదు. ఎప్పటికయినా తాము పాలస్తీనాకు పోతామని వాళ్ళ నమ్మకం. అయితే తమను తీసుకువెళ్ళడానికి యెహోవా స్వయంగా ఒక ప్రవక్తను పంపుతాడని ఛాందసులు నమ్మితే, అంతటి ఛాందసులు కాని వారు వలసకు మార్గాలను అన్వేషించడం మొదలుపెట్టారు.

1882లో రెండవ అలెగ్జాండరు చనిపోయిన తరువాత రష్యాలోను రష్యన్ సామ్రాజ్యంలోని తూర్పుయూరప్‌దేశాలలోను ఏర్పడ్డ అస్తవ్యస్త పరిస్థితులలో యూదులపై అత్యాచారాలు చాలా జరిగాయి. దానితో తూర్పు యూరప్‌కు చెందిన యూదులు చాలామంది పశ్చిమ యూరప్‌కు, అమెరికాకు వలసవెళ్ళారు. కొద్దిమంది తమ 'పవిత్రభూమి' అయిన పాలస్తీనాకు వెళ్ళారు. దానితో మొదలయింది పాలస్తీనాకు యూదుల వలస.

ఈ వలస మొదలయిన కొద్ది సంవత్సరాలకు దీనికొక సిద్ధాంతం గూడ పుట్టింది. ఆ సిద్ధాంతాన్ని జియోనిజం (Zionism) అంటారు. Zion అనేది, యూదుల పవిత్ర నగరమయిన జెరూసలెంను సూచించే మాట. జెరూసలెం పాలస్తీనాలో వుంది. ఆ పాలస్తీనాకు తిరిగి వెళ్ళడం యూదుల పవిత్ర ధర్మమనీ హక్కనీ నమ్మే సిద్ధాంతం జియోనిజం. ప్రథమ జియోనిస్టు సిద్ధాంత కర్త థియొడర్ హెర్జెల్ (Theodore Herzl) యూదువ్యతిరేకత చాలాబలంగావున్న ఆస్ట్రియాకు చెందిన యూదుడు ఈయన. 1895లో ఈయన రాసిన ఒక పాంప్లెట్ జియోనిస్టు సిద్ధాంత పత్రమయింది. అయితే ఆశ్చర్యమేమిటంటే, ఇవ్వాళ్టి ఇజ్రాయిల్ నాయకులతో పోలిస్తే హెర్జెల్ చాలా ఉదారవాది. అతను కోరింది, పాలస్తీనా అరబ్బులను పాలస్తీనానుండి వెళ్ళగొట్టి యూదుల రాజ్యం ఏర్పాటుచేయడం కాదు, 'పాలస్తీనా ప్రజలతో కలిసి ఒక ఉమ్మడి స్వస్థలాన్ని ఏర్పరచుకొని, వారి సోదరభావాన్నీ, సన్నిహిత సహకారాన్నీ సాధించడం'. అప్పటికి యూదులింకా ఒక పీడిత ప్రజలగానే వున్నారు. వారిలో చాలామంది బడా పెట్టుబడిదార్లు, ఆధునిక బూర్జువా సమాజం ఇచ్చిన అవకాశాలను వినియోగించుకున్న మేధావులు, సాంకేతిక నిపుణులు, ఉన్నమాట వాస్తవమే. అయినప్పటికీ వాళ్ళు మౌలికంగా ఒక పీడిత జాతే. తరువాతి కాలంలోనే వాళ్ళు సామ్రాజ్యవాదానికి సాధనాలుగా మారారు. మారిన తరువాతే జియోనిజంలో ఇవ్వాళ కనబడే జాతి దురహంకారం ప్రవేశించింది.

ఈ యూదుల వలస, దానితోబాటు జియోనిస్టు సిద్ధాంతాల ప్రభావం పెరిగే నాటికి పాలస్తీనా టర్కీ సామ్రాజ్యంలో భాగంగా వుంది. ప్రాచీన కాలంలో ఈజిప్టు, బాబిలోనియా, పర్షియా, రోమ్, ఆ తరువాత అరబ్ సామ్రాజ్యాలలో వుండిన పాలస్తీనా 16వ శతాబ్దం మొదటి భాగంలో టర్కీ పాలనక్రిందికి వచ్చింది. అప్పటినుండి, 1919లో మొదటి ప్రపంచ యుద్ధంలో టర్కీ ఓడిపోయే వరకు, టర్కీచేతనే పరిపాలించబడింది. ఫ్యూడల్ సామ్రాజ్యమయిన టర్కీలో సాంకేతిక

అభివృద్ధికి ఆస్కారం తక్కువ కాబట్టి బొత్తిగా అబ్రహాం కాలంలోలాగా లేకున్నా, బాగ్దాద్ ఖలీఫాల కాలంలో ఎలాగుండేదో అలాగే వుంది 20వ శతాబ్దంలో పాలస్తీనా. ఇటువంటి పాలస్తీనాకు వలస వచ్చారు యూదులు.

అందుకే మొదట్లో పాలస్తీనా అరబ్బులు యూదుల రాకను వ్యతిరేకించలేదు. యూదులు పాలస్తీనాకు బికార్లుగా రాలేదు. పెట్టుబడితో వచ్చారు. సాంకేతిక నిపుణతతో వచ్చారు. ఆధునిక బూర్జువా సమాజపు భావాలనూ సౌకర్యాలనూ మోసుకొచ్చారు. వాళ్ళరాకవల్ల వాణిజ్యం పెరిగింది వ్యవసాయం పెరిగింది, ఆధునిక భావాల వ్యాప్తికూడ పెరిగింది 1935 వరకుగూడ పాలస్తీనా అరబ్బులు యూదులు తమ దేశానికి రానేకూడదనలేదు — వాళ్ళ ప్రవాహంమీద కొన్ని పరిమితులుండాలని మాత్రమే కోరారు.

జియొనిస్టులు మాత్రం మొదటునుంచీ వేరే దృక్పథాన్ని కనబరిచారు. వాళ్ళు కేవలం ఆయుధాలతో పాలస్తీనా అరబ్బులను తమ నేలనుండి తరమలేదు. ఎక్కడ దెబ్బతీయాలో అక్కడే తీసారు — భూమిని చేజిక్కించుకున్నారు. తమ వెనుక సంపన్నులయిన జియొనిస్టు పెట్టుబడిదార్లు (ఫ్రాన్సులోను, ఇంగ్లండులోను, అమెరికాలోను) ఉన్నారు గనుక తమకు పుష్కలంగా డబ్బు దొరికింది. దానితో అరబ్బు భూస్వాముల భూములు కొన్నారు. కొని ఊరుకోక ఆ భూమిపైన పనిచేస్తున్న అరబ్బు రైతులను తొలగించి యూదులనే నియమించుకున్నారు. కూలీలను సహితం అరబ్బులను నియమించకూడదనీ, యూదులనే నియమించాలనీ జియొనిస్టు సంస్థలు నిర్ణయించుకున్నాయి. ఈ భూ ఆక్రమణ గురించి వివరాలు తెలుసుకోవలసిన అవసరం వుంది.

భూములు కొనుక్కోవడానికి కావలసిన పెట్టుబడిని సమకూర్చుకోవడానికి, 1901లో **Jewish National Fund** ను (యూదుల జాతీయ నిధి), 1920 లో **Palestine Foundation Fund** ను (పాలస్తీనా ఏర్పాటు నిధి) నెలకొల్పుకున్నారు. ఈ నిధులకు డబ్బులిచ్చింది, **Rothschild, Oppenheimer, Phillips,** తదితర పేరుపొందిన పెట్టుబడిదారీ కుటుంబాలేగాక, అసంఖ్యాకులయిన చిన్న చిన్న జియొనిస్టు పెట్టుబడిదార్లూను. ఈ నిధులనుండి భూ కొనుగోలు కోసం పెట్టుబడి తీసుకున్న యూదులు పాటించవలసిన నియమాలలో ఒకటి:

'ఋణగ్రహీత ఈ పెట్టుబడితో కొన్న భూమిమీద తానూ తన కుటుంబమూ

మాత్రమే పనిచేయాలి. కూలీలను తీసుకోవలసిన అవసరం ఎప్పుడయినా ఏర్పడితే యూదులనే తీసుకోవాలి'.

1925లో ప్రకటించిన Jewish Agency ప్రణాళికలో రెండు అంశాలు :

1. భూమిని యూదుల ఆస్తిగానే కొనాలి, యూదుల జాతీయనిధి పేరిటే కొనాలి.

2. Jewish Agency నిర్వహించే, లేక ప్రోత్సహించే, కార్యక్రమాలన్నింటిలోనూ యూదులనే నియమించాలన్నది నియమంగా పెట్టుకోవాలి.

ఇటువంటి సంస్థలే కాకుండా కొందరు జియోనిస్టు బడా పెట్టుబడిదార్లు వ్యక్తులుగా గూడ భూమి కొనుగోలుకు డబ్బు ఇచ్చేవారు. 1914 వరకు ఏర్పడ్డ 43 వ్యవసాయిక స్థిరవాసాలు (agricultural settlements) అన్నింటికి గూడ పెట్టుబడి Rothschild అనే ఒకే ఒక ఫ్రెంచి జియోనిస్టు కుటుంబం ఇచ్చింది. ఇంతటి పెట్టుబడి ఆసరా ఉండబట్టే యూదులు అరబ్బులను పాలస్తీనానుండి తరిమేసి ఇజ్రాయిల్‌ను ఏర్పరచుకోగలిగారు. 1948 తరువాత వాళ్ళు అవలంబించిన భూ ఆక్రమణ పద్ధతులను గురించి తరువాత చూద్దాం.

ఈ 'ఆచరణాత్మక జియోనిజం' (practical zionism) ఒకపక్క పని చేస్తోంటే వేరొకపక్క 'రాజకీయ జియోనిజం' (political zionism) తన ప్రయత్నాలు తాను చేయసాగింది. అంటే, ఒక పక్క నిధులు సేకరించి భూములు కొనుక్కొని ఆ భూముల నుండి అరబ్బు రైతులనూ కూలీలనూ తరిమేసి తాము స్థిరావాసాలు ఏర్పరుచుకోవడం కొనసాగిస్తూ, వేరొకపక్క యూదులకోసం ప్రపంచంలో ఎక్కడయినా భూమి చూసిపెట్టమని సామ్రాజ్యవాద ప్రభుత్వాలతో మంతనాలు జరిపారు. తమ దేశాలలో యూదులకు క్రైస్తవ మతోన్మాదం నుండి, యూదు వ్యతిరేకుల నుండి, రక్షణకు గ్యారంటీ ఇవ్వలేని సామ్రాజ్యవాద ప్రభుత్వాలు, తమ వలసల భూభాగాన్ని మాత్రం చాలా ఉదారంగా యూదులకు ఇవ్వడానికి సిద్ధమయ్యాయి. బ్రిటన్ తన వలస అయిన ఉగాండాలో 6000 చ॥మైళ్ళ భూభాగాన్ని ఇజ్రాయిల్ ఏర్పాటు కోసం ఇవ్వడానికి ఒప్పుకుంది. (ఇవ్వాళ్టి ఇజ్రాయిల్ భూవైశాల్యం 7900 చ॥మైళ్లు, అందులో చాలా భాగం ఎడారి. అంటే అనాటి

బ్రిటన్ ఔదార్యం తక్కువది కాదు.) అయితే జియొనిస్టులకు, 4 వేల ఏళ్ల క్రితం యెహోవా అబ్రహాంకు వాగ్దానం చేసిన భూమే కావాలి కాబట్టి ఉగాండా ప్రజలు బ్రతికి పోయారు. లేకపోతే ఇవాళ్టి పాలస్తీనా కథ ఉగాండా కథ అయి ఉండేది.

వాళ్ళయితే తిరస్కరించారుగాని బ్రిటన్ తన ఔదార్యాన్ని వదులుకోలేదు. 1919 తో మొదటి ప్రపంచ యుద్ధం ముగిసి టర్కీ ఓడిపోయింది. టర్కీ సామ్రాజ్యం, గెలుపొందిన బ్రిటన్ ఫ్రాన్స్ తదితర దేశాల పాలయింది. గెలిచిన దేశాలు ముక్కలు ముక్కలుచేసి పంచుకోవడం అనవాయితీయే గాని, ఈ 20వ శతాబ్దంలో అంత సులభం కాదు. కాబట్టి ఇప్పుడు టర్కీ సామ్రాజ్యంలోని వివిధ దేశాలను వలసలుగాకాక Mandated territories గా పంచుకున్నారు. Mandate అన్నది నానాజాతి సమితి (League of Nations) ఇస్తుందనీ, mandate తీసుకున్న సామ్రాజ్యవాద ప్రభుత్వం ఆ ప్రాంతం అభివృద్ధికి బాధ్యత వహిస్తుందనీ, కథనం. పాలస్తీనాపై mandate బ్రిటన్‌కు లభించింది. కథనం ఏదయినా వాస్తవం మాత్రం అది బ్రిటన్‌కు వలసగా మారిందన్నది.

తనకు పాలస్తీనాపై mandate లభించగానే బ్రిటన్ చేసిన మొట్టమొదటి పని యూదులకు అక్కడ ఒక నివాసస్థానం ఏర్పాటు చేయడం పట్ల తన సుముఖతను ప్రకటించడం. దీనిని బాల్ఫోర్ ప్రకటన (**Balfour declaration**) అంటారు. దీనికి కారణం కేవలం యూదులపట్ల ప్రేమకాదు. మధ్యధరా సముద్రం తూర్పు తీరాన వున్న పాలస్తీనాలో తమకు అనుకూలమయిన ప్రభుత్వం ఉంటే సూయజ్ కాలవ ముఖాన్ని సంరక్షించుకోవడం సులభం.

బాల్ఫోర్ ప్రకటనలో నిజానికి బ్రిటన్ చాలా మెలకువతో వ్యవహరించింది. యూదులకు పాలస్తీనాలో నివాస స్థానం ఏర్పరచాలని అంటూనే, అక్కడ యూదుల రాజ్యం స్థాపించాల్సిన అవసరం లేదనింది. ఈ నీళ్ల నములుడుతో జియొనిస్టులేకాదు, శాంతిని గురించి నీతిని గురించి ధర్మాన్ని గురించి ఎడతెరిపి లేకుండ ఉపన్యాసాలిచ్చే అమెరికా అధ్యక్షుడు వుడ్రో విల్సన్‌కూడ విభేదించాడు. బ్రిటన్ బాల్ఫోర్ ప్రకటనను ఉపసంహరించుకునేదాక సహాయ నిరాకరణ ప్రకటించారు అరబ్బులు. పాలస్తీనాలో ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలని 1921లో తొలిసారి డిమాండు చేసారు. దీనికి సమాధానంగా బ్రిటన్ 1922 లో ఒక శాసన సభను ఏర్పరిచిందిగాని అందులోని 12 మంది సభ్యులలో ఇద్దరు యూదులుండాలని నిర్బంధించడమే కాక, ఆ శాసన సభకు

నిర్ణయాలపై వీటో అధికారం బ్రిటిష్ హైకమీషనర్‌కు ఇచ్చింది. అరబ్బులు ఆ శాసన సభకు జరిగిన ఎన్నికలను బహిష్కరించారు. 1928లో మళ్లీ పాలస్తీనాకు స్వాతంత్ర్యాన్నీ ప్రజాస్వామిక ప్రభుత్వాన్నీ ఇవ్వాలని డిమాండు చేసారు. 1929లో జెరూసలంలో యూదులకు ముస్లిం అరబ్బులకూ ఒక పవిత్ర స్థలం గురించి కలహం వచ్చింది. బ్రిటిష్ ప్రభుత్వం విచారణార్థం నియమించిన ఒక కమిషన్, యూదుల వలసే అరబ్బుల అసంతృప్తికి కారణమనీ, వాళ్ళ వలసపై పరిమితులుండాలనీ, అరబ్బు కౌలుదార్లకు రక్షణ ఇవ్వాలనీ, సూచించింది. బ్రిటిష్ ప్రభుత్వం ఆ సూచనలను అంగీకరించిందని విని జియొనిస్టులు గొడవచేసి బ్రిటిష్ ప్రధాని రాంసే మెక్‌డోనాల్డ్ నుండి, ఆ సూచనలను 'ఉదారంగా' అమలు చేస్తామన్న వాగ్దానాన్ని తెచ్చుకున్నారు.

1933 తరువాత యూరప్‌లో నాజిజం, ఫాసిజం బలపడి, యూదువ్యతిరేకత భయంకరమయిన రూపం తీసుకోవడంతో పాలస్తీనా వైపు యూదుల ప్రవాహం వేగం పుంజుకుంది. నాజిజం నశించేలోపల, యూరప్‌లోని 95 లక్షల మంది యూదులలో 57.5 లక్షల మందిని హతమార్చింది.

దీనివల్ల ఒకపక్క యూదుల ప్రవాహం పెరిగితే, వేరొకపక్క పరిసరాల ప్రభావం వల్ల పాలస్తీనా అరబ్బుల ప్రతిఘటన కూడ పెరిగింది. చుట్టూ వున్న అరబ్బుదేశాలు ఆ కాలంలోనే స్వతంత్రమయ్యాయి. జోర్డాన్ 1936లో, ఇరాక్ 1932లో, సిరియా ఈజిప్టులు 1936లో, స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్నాయి. స్వతంత్రమయిన నాటి నుంచి గూడ ఈ దేశాలన్నీ పాలస్తీనా అరబ్బులకు తమ మద్దతు ప్రకటించాయి. 1934లో బ్రిటన్ పాలస్తీనాను పరిపాలించే వలస ప్రభుత్వానికి ఒక సలహాదారుల సభ (Advisory council) ను ఏర్పరిచింది. ఆ సభ సభ్యత్వ పంపకం అరబ్బులకూ యూదులకూ గూడ రుచించలేదు. అయినా అరబ్బులు సర్దుకుపోదల్చుకున్నారు గాని యూదులు మాత్రం అప్పటికే బాగా బలపడ్డ తమ సంకల్పానికి చిహ్నంగా దాన్ని తిరస్కరించడమే గాక పార్లమెంటులో తమకున్న ప్రభావాన్ని వాడుకుని ఆ సభ ఏర్పాటే జరగకుండ చూసారు. అలాంటి ప్రభావమేదీలేని అరబ్బులు మాత్రం బ్రిటన్ ఏంచేసినా సహించాల్సి వచ్చింది. 1933లో వాళ్ళు మళ్ళీ, పాలస్తీనాలో ప్రజాస్వామిక ప్రభుత్వం ఏర్పరచాలనీ, అరబ్బుల భూములను యూదులు కొనడాన్ని నిషేధించాలనీ, దేశం ఎంతటి జనాభాను భరించగలదో నిర్ణయించుకునేదాకా యూదుల వలసను ఆపాలనీ, డిమాండు చేసారు. 1935లో గూడ

అరబ్బులు యూదుల వలసను ఆపాలనిగానీ, వలసవచ్చిన యూదులు తిరిగి యూరప్‌కు వెళ్ళిపోవాలని గానీ, కోరకపోవడం గమనార్హం. అంతటి ఔదార్యం జియొనిస్టులు ఎన్నడూ ప్రదర్శించలేదు. అయినా ఆనాటి డిమాండులను గూడ బ్రిటన్ తిరస్కరించింది. 1919లో 10 శాతం గూడలేని యూదులు 1933 నాటికి 20 శాతం, 1938 నాటికి 30 శాతం, 1945 నాటికి 35 శాతానికి ఎదిగారు. ఫలితంగా 1937-39 కాలంలో అరబ్బులలో తీవ్రమయిన తిరుగుబాటు జరిగింది. దాన్ని బ్రిటన్ పాశవికంగా అణిచివేసింది.

ఇంతలో రెండవ ప్రపంచయుద్ధం వచ్చింది. వ్యూహాత్మకంగా చాలా సున్నితమయిన పాలస్తీనాలో అల్లరెందుకని బ్రిటన్ తన ఎత్తుగడ మార్చుకుంది. అంతకుముందు, 1937లో, పాలస్తీనాను రెండుగా విభజించి ఒక అరబ్బురాజ్యం, ఒక యూదురాజ్యం, ఏర్పరచడం సబబని ప్రతిపాదించిన బ్రిటన్, ఇప్పుడు అటువంటి విభజన అక్కరలేదనీ, అరబ్బులూ యూదులూ కలిసిమెలిసి సుఖంగా (కనీసం తాను యుద్ధం గెలిచేదాకా) ఉంటే బాగుంటుందనీ, ప్రకటించింది. అరబ్బులను మంచి చేసుకోవడం కోసం, యూదుల సంఖ్య పాలస్తీనా జనాభాలో 3వ వంతు మించకూడదని గూడ సూచించింది. ఇంత జరిగిన తరువాత కలిసి ఒకే రాజ్యంలో వుండడం సాధ్యం కాదని ఇద్దరూ ఆ ప్రతిపాదనను తిరస్కరించారు.

యుద్ధకాలంలో పాలస్తీనాలోని యూదులు మరింత బలపడ్డారు. మొదట్లో చెప్పినట్టు, యూదులు చారిత్రకంగా పట్టణవాసులు, ఎక్కువగా వ్యాపారస్తులు. పాలస్తీనాకు వలస వచ్చినవారిలో గూడ, అల్పసంఖ్యాకులు మాత్రమే వ్యావసాయిక స్థిరావాసాలు ఏర్పరచుకొని నారింజ (citrus) తోటల వంటివి పెంచారు. ఎక్కువగా పరిశ్రమలు, వ్యాపారం చేపట్టారు. ఉదాహరణకు 1914లో పాలస్తీనాలోని 90,000 మంది యూదులలో 13,000 మంది మాత్రమే అప్పటికి ఏర్పడ్డ 43 వ్యావసాయిక స్థిరావాసాలలో వున్నారు, మిగిలిన వాళ్ళంతా పట్టణాల్లోనే వున్నారు. వీళ్ళు 1925లో హీబ్రూ విశ్వవిద్యాలయాన్నీ, అటు తరువాత దేశ పారిశ్రామికీకరణను దృష్టిలో వుంచుకుని పాలస్తీనా విద్యుత్ కార్పొరేషన్‌ను, దేశానికి తూర్పున వున్న Deed Sea అనబడే విశాలమయిన చెరువు గర్భాన వున్న ఖనిజసంపదను అన్వేషించడానికి పాలస్తీనా పొటాష్ కంపెనీని, స్థాపించారు.

ఈ పెట్టుబడిదార్లు, వ్యాపారస్తులు, యుద్ధంవల్ల మరింత బలపడ్డారు. యుద్ధ కాంట్రాక్టులు వాళ్ళ విస్తరణకు దోహదం చేసాయి. దానితో జియొనిజం గూడ

మరింత మొండిగా తయారయింది. 1947లో బ్రిటన్ తానింక mandate ను కొన సాగించలేనని చెప్పి ఐక్యరాజ్యసమితికి (UNO) అప్పజెప్పింది. ఐక్యరాజ్యసమితి, పాలస్తీనాలో ఒక యూదులరాజ్యం, ఒక అరబ్బుల రాజ్యం, నెలకొల్పాలని నిర్ణయించింది. కొంత దొరికితే చాలు అంతా కబళించవచ్చుననే దృష్టితో జియోనిస్టులు అంగీకరించారు గాని, తమదేశాన్ని రెండుగా చీల్చడాన్ని అరబ్బులు వ్యతిరేకించారు.

1948 మే 15న బ్రిటన్ పాలస్తీనా నుండి వెళ్ళిపోయింది. ఆ రోజే జియోనిస్టులు 'ఇజ్రాయిల్' రాజ్యాన్ని ప్రకటించుకున్నారు. దాదాపుగా ఆ తరువాతి నాటి నుండి మొదటి అరబ్-ఇజ్రాయిలీ యుద్ధం ప్రారంభమయింది. సాంకేతికంగా చాలా వెనకబడివున్న అరబ్బులు ఇజ్రాయిల్ శక్తికి తట్టుకోలేక ఓడిపోయారు. యూదులు పాలస్తీనాలో ఆక్రమించుకోగలిగినదంతా ఆక్రమించుకుని అంతా ఇజ్రాయిలేనన్నారు. ఆ ప్రాంతాల పాలస్తీనియన్లలో చాలామంది పక్కనున్న సిరియా, లెబనాన్, జోర్డాన్, ఈజిప్టులకు పారిపోయారు. అప్పటినుండి అక్కడి శరణార్థుల క్యాంపులనుండి పోరాటం చేస్తున్నారు. శరణార్థులుగా వెళ్ళిపోయిన అరబ్బులు తిరిగి రాకుండ చేయడం కోసం అవసరమయిన చట్టాలను పకడ్బందీగా తయారు చేసుకుంది ఇజ్రాయిల్. 1948లో రెండు చట్టాలను జారీచేసింది. ఒకదాని ప్రకారం భూమిని ఎవరయినా ఒక సంవత్సరకాలం బీడుపెడితే ఆ భూమి ప్రభుత్వానిదవుతుంది. దీన్ని వాడుకొని శరణార్థులుగా వెళ్ళిన అరబ్బు రైతుల భూముల్ని కాజేసి యూదులకిచ్చింది ఇజ్రాయిలీ ప్రభుత్వం. అయితే కొన్ని సందర్భాలలో భూస్వాములు పారిపోయి భూమిని దున్నే రైతులు ఉండిపోవడం జరిగింది. ఈ భూముల్ని స్వంతం చేసుకోవడం కోసం రెండవ చట్టం పనికొచ్చింది. పారిపోయిన భూస్వాములను absentee landlords గా ప్రకటించి ఆభూములను గూడ ప్రభుత్వం తీసేసుకుంది. తీసుకుని, దాన్ని దున్నుతున్న అరబ్బు రైతులను తొలగించి యూదులకు ఇచ్చింది. ఫలితంగా, తాత్కాలికంగా పాలస్తీనా వదలివెళ్ళి మళ్ళీ ఒక సంవత్సరం తరువాత తిరిగివచ్చిన అరబ్బులు గూడ తమ సర్వస్వం కోల్పోయారు. ఇది చాలదన్నట్టు, 'దేశ రక్షణార్థం, కొత్తగా వలస వచ్చిన యూదులకోసం' ఎవరి భూమినయినా ప్రభుత్వం తీసేసుకోవచ్చుననే చట్టాన్ని 1953లో జారీచేసారు. దాన్ని అరబ్బుల మీద మాత్రమే ప్రయోగించారని వేరే చెప్పనక్కరలేదు. ఈ చర్యలన్నిటి ఫలితాన్నీ ఇజ్రాయిల్ ప్రభుత్వ వ్యావసాయిక శాఖ (Ministry of Agriculture) స్వయంగా ప్రకటించింది. 1948 నుండి 1963 నాటికి ఇజ్రాయిల్‌లోని సగటు అరబ్ కుటుంబం భూమి 3.75ఎకరాల

నుండి 1.1 ఎకరాలకు పడిపోయింది. ఆ తరువాతి కాలంలో పరిస్థితి మరీ అధ్వాన్న మయింది. ఒక సోవియట్ రచయిత ప్రకారం (పై వివరాలన్నీ ఆ రచయిత నుండి తీసుకున్నవే), ఇజ్రాయిల్‌లోని అతిపెద్ద అరబ్బు గ్రామం అయిన ఉమ్మల్-ఫాహెం లోని అరబ్బు రైతులూ భూస్వాములూ కలిసి ఒకప్పుడు 35,000 ఎకరాలు కలిగి వుండేవారట. 1976 నాటికి అది 3,000 ఎకరాలకు దిగింది. ఇజ్రాయిలీ సైన్యం ఎన్నిరకాల తుపాకీలు వాడిందీ, ఎన్ని టన్నుల బాంబులు ప్రయోగించిందీ, ఎన్ని రకాల వ్యూహాలు పన్నిందీ వివరంగా చెప్పే బూర్జువా పత్రికలు ఈ మౌలికమయిన భూఆక్రమణను గురించి మనకు ఎన్నడూ చెప్పవు. ఆస్తి సంబంధాల గురించి 'పబ్లిగ్గా' మాట్లాడుకోవడం బూర్జువా సంస్కృతికే అపచారం.

యుద్ధాలగురించి చెప్పుకోవాలంటే రెండు మాటలలో చెప్పుకోవచ్చు. 1948 లోని మొదటి యుద్ధం తరువాత 1956లో ఒకసారి, 1967లో ఒకసారి, 1973లో ఒకసారి, ఇప్పుడు మళ్ళీ 1982లో మరొకసారి, అరబ్-ఇజ్రాయిలీ యుద్ధాలు జరి గాయి. 1956లో ఈజిప్టు సూయజ్ కాలువ కంపెనీని జాతీయంచేసి పాశ్చాత్యదేశాల నోట్లో మన్నుకొట్టినప్పుడు బ్రిటన్ ఫ్రాన్సులు ఈజిప్టుమీద స్వయంగాదాడి ప్రారం భించడానికి నైతిక ధైర్యం చాలక ఇజ్రాయిల్‌ను ముందు పెట్టుకుని వెనకతాము యుద్ధానికి దిగాయి. అరబ్బుదేశాలు ఉన్నంతకాలం పాలస్తీనా శరణార్థులకు నిలువ నీడ, పోరాటానికి స్థావరం, ఉంటాయన్న భయంతో ఇజ్రాయిల్ దొరికిన అవకా శాన్నల్లా ఉపయోగించుకొని అరబ్‌దేశాల మీదదాడి చేస్తోంది. 1967లో సిరియా మీద, సిరియాకుసాయం వచ్చిన ఈజిప్టు జోర్డాన్‌లమీద దాడిచేసింది. చేసి చాలా భూభాగాన్ని ఆక్రమించుకుంది. (ముఖ్యంగా, ఈజిప్టుకు చెందిన సినాయి ద్వీప కల్పం, జోర్డాన్‌కు చెందిన జోర్డాన్‌నదీ పశ్చిమతీరం). తాను కోల్పోయినభూమిని తిరిగి పొందడానికి ఈజిప్టు 1973లో ఇజ్రాయిల్‌మీద దాడి చేసిందిగాని పూర్తిగా సఫలీకృతం కాలేదు.

1956 సూయజ్ సంఘటన తరవాత, ఇజ్రాయిల్‌ను అంతర్జాతీయంగా వెనకేసుకొచ్చే బాధ్యత బ్రిటన్ నుండి అమెరికాకు సంక్రమించింది. రెండవ ప్రపంచ యుద్ధంతో అస్తమించిన బ్రిటిష్ సామ్రాజ్యవాదం స్థానంలో ముందు కొచ్చిన అమెరికా సామ్రాజ్యవాదానికి, బ్రిటన్‌కు ఏ వ్యూహాత్మక అవసరాలుండేవో అవే ఉన్నాయి. కాకుండా, అమెరికాలోని కోటీశ్వరులలో 20 శాతం యూదులు కావడంతో జియోనిజాన్ని సమర్థించడం అమెరికాకు తప్పనిసరి.

అయితే పాలస్తీనియన్లకు ఇజ్రాయెల్, అమెరికాలు ప్రత్యక్ష శత్రువులయితే, ఇతర అరబ్బురాజ్యాలు మిత్రరూపంలోని శత్రువులేమోనన్న అనుమానం వస్తుంది. ఆయాదేశాల ప్రభుత్వాల ఇజ్రాయిల్-వ్యతిరేకత తమదేశ ప్రజల దృష్టిలో 'లెజిటిమెసీ' సంపాదించుకోవడానికి పనికొచ్చినంతగా పాలస్తీనా పోరాటానికి పనికిరాలేదు. పైగా పాలస్తీనా ప్రజల ప్రతిఘటనకు నాయకత్వం వహిస్తున్న పాలస్తీనా విమోచన సంస్థ (PLO) దృక్పథంలో వున్న ఆధునికత, ప్రజాస్వామిక తత్వం, వాళ్ళకు చుక్కెదురు. యూదు వ్యతిరేక మతతత్వానికి, ముస్లిం మతోన్మాదానికి, ఎంతో ఆస్కారం వున్న పరిస్థితులలో గూడ PLO మతతత్వానికి లొంగకపోవడం ప్రజాస్వామికవాదుల దృష్టిలో ఎంత ప్రశంసనీయమో, ఆ వైఖరిలోని ఆధునికతకు భయపడే అరబ్ రాజ్యాల ప్రభువులకు అంత ఇబ్బందికరం. కాబట్టే పాలస్తీనా అరబ్బులకు జోర్డాన్, సిరియా, ఈజిప్టులు చేసిన చేతల సహాయం మాటల సహాయాన్ని మించడం అటుంచి దరిదాపులకు గూడరాలేదు. ఈ వాస్తవాన్ని ఒక్కొక్క అరబ్బురాజ్యం బయటపెట్టుకుంది. జోర్డాన్‌ను PLO స్థావరంగావాడుకోవడం ఇష్టంలేక జోర్డాన్ ప్రభుత్వం 1970లో PLOను హింసాత్మకంగా తనభూభాగంనుండి బయటకు తరిమింది. ఆనాడు ఎవ్వరూ కిక్కురుమనలేదు. ఈజిప్టయితే ఈ లంపటం వద్దని నిర్ణయించుకుని 1978లో ఇజ్రాయిల్‌తో ద్వైపాక్షిక సంధిచేసుకొని (Camp David acco d) సినాయి ద్వీపకల్పాన్ని తిరిగి చేజిక్కించుకొని తాను జియొనిస్టు వ్యతిరేకపోరాటం నుండి విరమించుకుంది. సిరియా ఎంత చేయగలదో ఈనాటి లెబనాన్ యుద్ధంలో బయట పడుతోంది. ఇజ్రాయిల్ దాడినుండి లెబనాన్ యుద్ధంలో బయట పడుతోంది. ఇజ్రాయిల్ దాడినుండి లెబనాన్‌లో వున్న తన సేనలను రక్షించుకోవడానికే తప్ప PLOకుగాని వాళ్ళ లెబనీస్ మిత్రులకుగాని ఎటువంటి రక్షణ ఇచ్చే ప్రయత్నమూ చేయడంలేదు సిరియా.

సౌదీ అరేబియావంటి అనాగరిక రాజ్యాన్ని, ఇరాన్‌తో అనవసరమయిన యుద్ధంచేసి ఓడిపోయి బలహీనంగా పడున్న ఇరాక్‌ను, ఎక్కడో దూరానవున్న లిబియా అల్జీరియాలను, లెక్కపెట్టకుంటే, ఇక పాలస్తీనియన్లకు మిగిలిన మిత్రులు లెబనాన్‌లోని ముస్లింఅరబ్బులు మాత్రమే. అక్కడి క్రైస్తవులు ఎప్పుడూ ఇజ్రా

యిల్ పక్షమే. ద్రవ్యపెట్టుబడికి (banking capital) ఒకనాడు కేంద్రంగావుండిన లెబనాన్‌లో ధనికులు ఎక్కువగా క్రైస్తవులు, పేదలు ముస్లింలు. ఈ ముస్లిం అరబ్బులలో వామ పక్షభావాలు బలంగావున్నాయి. అయినా వాళ్ళశక్తి PLO సైన్యం శక్తి కలిసి 20,000 సైనికులు మాత్రమే కాగా దాడిచేస్తున్న ఇజ్రాయిల్ సేనల సంఖ్య ఒక లక్షవరకు వుంది. సోవియట్ రష్యా దూరంనుండి డాంబికాలు పలుకుతుంది గాని సాయం మాత్రం చేయదు. రష్యా సిరియాతో 1980లో చేసుకున్న ఒప్పందం ఒకటుంది. (భారత-రష్యా ఒప్పందం వంటిది.) ఆ ఒప్పందం ప్రకారం సిరియాపై ఎవరయినా దాడిచేస్తే రష్యాసాయం చేయాలి. కాని సిరియా ఇజ్రాయిలీ సేనల చేతులలో ఇన్ని దెబ్బలు తింటున్నా, సోవియట్ ప్రభువులు మాత్రం దిగిరాలేదు.

ఇవ్వాళ్టిఇజ్రాయిల్ ఆశయం స్పష్టమే. లెబనాన్‌లో గూడ PLOకు ఆశ్రయం లేకుండచేస్తే ఇక పాలస్తినా విమోచన ఉద్యమం నశించిపోతుందని వాళ్ళ నమ్మకం. పనిలో పనిగా-ఒక పరిశీలకుడు అన్నట్టు-లెబనాన్‌దక్షిణప్రాంతాన్ని లిటానీనది వరకు ఆక్రమించేస్తే, ఎడారిమయమయిన ఇజ్రాయిల్‌కు లిటానీనది నీరు దొరికినా దొరికినట్టే. ప్రస్తుతానికి ఇజ్రాయిల్ PLOను లెబనాన్‌నుండి తరిమేస్తుందన్నది ఖాయమే, కాని జియోనిజం తాలూకు దీర్ఘ కాలిక లక్ష్యమయిన పాలస్తినా విమోచన ఉద్యమ అస్తమయం ఆసన్నమయిందనుకుంటే పొరబాటే. కావాలంటే అనుభవజ్ఞులయిన తమ అమెరికా ప్రభువులనడిగి తెలుసుకోవచ్చు.

### చెరబండరాజు ఫోటో

గతసంచిక ముఖచిత్రంగా వేసిన చెరబండరాజు ఫోటో తీసినవారు శ్రీ జి. భరత్ భూషణ్. గతసంచికలో పొరపాటున ఆయనపేరు ప్రస్తావించబడలేదు.

— 'సాహితీమిత్రులు'

## చెరబండరాజు

అల్లం వీరయ్య

చెరబండరాజు చెరబండరాజు
మనసంతామానేరు మాటకోనేరు
ఓపక్క కన్నీరు ఆపక్క పోరు
నవ్వితే మల్లేలు బతుకు పల్లేరు

॥చెరబండరాజు॥

అంకుశాపురమున నాయన్నపుట్టె
చెయ్యెత్తి నిలుచుంటె చెట్టంత మనిషి
పిల్లపాపలున్న పేదపంతులు
దిక్కుల్ల దిగంబర కవుల్లొక్కాడు
చుక్కల్ల ఆరూపు చెక్కుండేమో
మాపల్లె మీపల్లె మాటల్లనువ్వే

॥చెరబండరాజు॥

ఒక్కటొక్కటి కలిసి రెండవుతయంటే
తూరుపున సూర్యుడు ఉదయించునంటే
తొలిపొద్దు సూర్యుడు ఎరుపున్నడంటే

॥చెరబండరాజు॥

కేసుల్లో ఇరికించి గోసపెట్టింద్రో
నౌకరిపీకేసి నవ్వుకున్నారు
కుట్రచేసింద్రాని ఖైదుచేసింద్రు
ఖైదులో నీకవిత గళము విప్పింది
పాటొక్క ఈటయ్యి పదునుదేలింది
మాటొక్క బాకయ్యి మెరిసిపోతుంది

॥చెరబండరాజు॥

ఓనాటి రోజున రాతిరయ్యింది
మాయరోగం నిన్ను మాటుగాసింది
గొంతులో రాగాలు మూగపోతేను
మనసులో భావాలు ఆగిపోయినవి

॥చెరబండరాజు॥

# మంచి ముత్యాలు

ఈ కథాసంపుటిలో ఏడు కథలున్నాయి. ఇవన్నీ ఇదివరకు పత్రికల్లో వచ్చిన కథలే. ఇందులో మూడు పూర్తిగా వేటకు సంబంధించినవి. మిగిలిన కథల్లో వేట లక్షణం కనిపిస్తుంది. ఈ మొత్తం కథల్లో కనిపించే వేట లక్షణం సామాన్యమయింది కాదు. సమాజంలో మనుషుల మధ్యనున్న వేటను ఈ కథలు పాఠకుని కళ్ళముందు స్పష్టంగా చిత్రిస్తాయి. వేటాడబడుతున్న వాళ్ళు ఏంచేసారో చెప్పడంవలన దోపిడీ దౌర్జన్యాలకు గురి అయ్యేవారు ఏం చేయాలో తెలుస్తుంది. అందువలన ఈ కథలకు ప్రత్యేకమైన ప్రయోజనం ఉన్నది.

బ్రతుకంతా అడవిలాగా ఉన్న బైరిగాడు కోమటి సూరయ్యకు బాకీపడిన 300 రూపాయలలో కొంతయినా తీర్చాలని నాటు తుపాకీ భుజాన వేసుకొని వేట కొరకు అడవికి వెళతాడు. లేకపోతే మూడు సంవత్సరాలనుంచి వర్షాలు పడక బీడు పడిపోయిన తన మెరకపొలాన్ని సూరయ్య లాక్కుంటాడు. అప్పటికి తిండి పెట్టక పోయినా తాను శ్రమించినప్పుడు తగిన ఫలితాన్ని ఇచ్చే భూమితల్లిమీద బైరిగాని ఆప్యాయత శ్రమజీవి ఆప్యాయత. బైరిగాడు దుప్పిని వేటాడి ఎంతో కష్టపడి ఇంటికి చేర్చేసరికి ఇంటదగ్గర ఫారెస్టుగార్డు తయారు. వేటాడడానికి తుపాకికై సెన్స్ లేదని జులుం చేస్తుండగా సూరయ్యవచ్చి మేలుచేసేవాడిలాగ 100 రూపాయలు

---

మనసున పూచిన నీ పాటలన్నీ
నాలుక కదిలిస్తే నాదస్వరాలు
గువ్వల్ల గుండెల్ల గుసగుసలాడు
చిలుకల్ల పలుకుల్ల కిలకిలలాడు
కోయిల్ల గొంతుల్ల కువకువలాడు
శ్రమజీవి కన్నులు కలకలలాడు

॥చెరబండరాజు॥

చెరబండరాజు చెరబండరాజు
మనసంతా మానేరు మాటకోనేరు
(చెరబండరాజు స్మృతిలో—
మదనా సుందారి మదనా సుందారి పాటబాణీ)

లంచమిచ్చి, బైరిగాని చేత కాయితంమీద నిశానీ వేయించుకుంటాడు. వంద రూపాయలు చేతిలో పడేసరికి అంతవరకూ మాట్లాడిన చట్టం గురించి గార్డు మరచిపోయి, తనకంటే ఎక్కువ దాహంగల రేంజరు ఇంటికి దుప్పిని పంపుతాడు. అన్యాయం చేయడం వలన లాభపడేది ధనవంతులైతే నష్టపోయేది పేదవాళ్ళు. శ్రమకు విలువ నివ్వకుండా సంపదకే విలువనిచ్చే ఈ ధనమృగాలను వేటాడితేతప్ప లాభంలేదు. కసితోనూ, పగతోనూ రక్తం మరిగిపోతుండగా ఇంటికి వచ్చిన బైరిగాడు తన మెరక మీద ఆశ వదులుకోవడమేకాదు. ఇప్పటి సమాజంలో కష్టంమీద ఆధారపడి న్యాయంగా బతకాలనుకోవడం ఎండమావి వంటిదని అనుకున్నాడు. అందుకే మళ్ళీ "తుపాకీ తీసాడు—జంతువుల వేటకేకాదు" పులుల్ని తోడేళ్ళని ముక్కలు ముక్కలుగా సరికే విముక్త నారాచంలా ఏకైకలక్ష్యంతో తన బతుకులా చీకటి వ్యాపించిన అడవిలోకి, కొండల్లోకివెళ్ళాడు.

డబ్బుతోను, కీర్తితోను పొరలు కమ్మిన వాళ్ళు ఆ రెండింటికోసం ఇతరులను ఎట్లా బలిఇస్తారో చెప్పే కథ "ది డెత్ ఆఫ్ ఎ మేనీటర్" మనిషి రక్తానికి మరిగిన పులిని వేటాడడానికి వచ్చిన కనకరాజు ఎద్దుని పులికి ఎరగా పెడతాడు. పులి చిక్కదు. దాన్ని ఎలాగైనా చంపి, పట్నంలో ఊరేగి పేరు తెచ్చుకోవాలనుకున్న కనకరాజు తన దగ్గర నమ్మకంతో పనిచేసే రాములును ఎరగా పెట్టడానికి పూనుకుంటే, అనుకోకుండా తనకొడుకే ఎరఅయిపోతాడు. పులిని చంపడానికి దాన్ని వెంబడించిన కనకరాజు దానిచేతిలో చావుదెబ్బ తింటాడు. చివరకు 'మేనీటర్' క్రూరంగా చనిపోతాడు.

మనుషులకు జంతువులను, పక్షులను వేటాడే అవకాశం ఉండడంలోకూడా వర్గభేదంఉంది. జీవనోపాధికోసం కూడా బైరిగాని వంటివాడు లైసెన్స్ లేదు కాబట్టి వేటాడకూడదు. అది ఉన్నంత మాత్రాన భూస్వాములు, ధనవంతులు స్వేచ్ఛగా సరదాగా గొప్పతనంకొరకు వేటాడవచ్చు. అతిప్రాచీనకాలంలో మానవ నాగరికత పెరుగుదలలో ఒకభాగంగా జీవనోపాధికి ఒకఅవసరంగా ఉన్నవేట మధ్యయుగాల నాటికి రాజుల వినోదానికి, ఆటవికత్వానికి సాధనంగా మారింది. ఈ భూస్వామ్య సంస్కృతి వలన పాలనలో సంస్థానాధీశులను, జమీందారులను ఆశ్రయించుకుని, కీర్తిప్రతిష్టలను తెచ్చేదిగా పెత్తలు వేసింది. కుక్కలను పెంచడం కూడ ఫాషనై వికృతంగా మారింది. ఈ సంస్కృతి చక్కగా ప్రతిబింబించిన కథ 'పులి చెఱువులో పిట్టలవేట' తనకు కాబోయే భార్య అయిన అందమైన అమ్మాయి

ముందు ఆనందంకోసం వేట తమకంలోపడి, ప్రమాదవశాత్తు ఊబిలో దిగబడి అతి విషాదంగా ప్రాణాలు కోల్పోయిన అబ్బాయి కథ ఇందులో ఉంది.

ఈ వేట కథలు చదివితే రచయితకు వేటతో, అడవితో మంచి పరిచయం ఉన్నట్లు అర్థమవుతుంది. వేటాడడంలో ఉండవలసిన చురుకుతనం, అడవి జంతువుల స్వభావం, పశుల చేష్టలు మొదలయినవి ఇందులో స్పష్టంగా వర్ణించబడినాయి. అయితే వాతావరణంతో పరిచయం లేనివారికి కొన్ని పదాలు అర్థంకావు.

ఇందులో ఉన్న మరొక మంచి కథ 'వఱడు' ఇదివరకు మిల్ట్రీలో పనిచేసి వచ్చి ఒక సివిల్ ఆఫీసర్ దగ్గర జీపు డ్రైవరుగా పనిచేస్తున్న చిన్నయ్యకు సివిలోళ్ళంతా దొంగలని, పౌరజీవితం అంతా అవినీతిమయం అని అభిప్రాయం ఉంది. అయితే అప్పుడప్పుడు బయటపడుతున్న సంఘటనలను బట్టిచూస్తే మనదేశపు మిల్ట్రీలో ఎటువంటి అవినీతి, అక్రమాలు ఉన్నాయో తెలుస్తుంది. అయితే ఈ లక్షణాలు పౌరజీవితంలో ఎక్కువగా కనిపించడానికి కారణం ఈ జీవితంలో ఉన్న సంక్లిష్టత, సమస్యలు. నెత్తురు ఓడ్చి పనిచేసినా పూటగడవని జీవితాలు మనకు ఇక్కడ అసంఖ్యాకంగా కనిపిస్తాయి. పొట్టకూటి కోసం తనకు ఉపకారం చేసినవాడికే వెన్నుపోటు పొడిచే పిరికితనం ఉండి, ఆత్మగౌరవం లేని, వెన్నెముక వంగిన మధ్యతరగతి జీవితాలు వున్నాయి. ఈ పరిస్థితుల్లోనే విభజించి పాలించే పద్ధతి చక్కగా సాగుతుంది. దిగజారిన మధ్యతరగతి జీవితానికి దశరధరామయ్య పాత్ర ఒక గుర్తు. దశరధరామయ్యకు సహాయం చేసి, అతని ద్రోహం వల్లనే చిన్నయ్య ఉద్యోగం పోగొట్టుకుంటాడు. మనిషి మాంసం తినమరిగిన పులులంటే తప్ప చిన్నయ్యకు పులులంటే భయంలేదు. చేతకాని ముసలితనంలో పులితో స్నేహం చేసి, ఇతర జంతువులను చంపించి తన పబ్బం కూడ గడుపుకునే వఱడు (ముసలి నక్క) అంటే అతనికి భయం. అతడు దశరధరామయ్యతో అలాగే దెబ్బతిన్నాడు. పెట్టుబడి దారీ విధానం, సామ్రాజ్యవాదులతో స్నేహం చేసి భూస్వామ్యం ప్రజలను దోపిడీ చేయడం నిరాటంకంగా సాగనివ్వడం ఇటువంటిదే. తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటాన్ని నెత్తురు టేరుల్లో ముంచడం వెనుక మనకు ఈ దగుల్బాజీతనం కనిపిస్తుంది.

సమకాలీన రాజకీయాలు ఎంత కలుషితమైనవో 'నరమేధం' అన్న కథ చక్కగా వివరిస్తుంది. రాజకీయాల్లో ఆధిక్యం కోసం, ప్రజల్లో ప్రచారం కోసం ఒక

ప్రణాళికను, కార్యక్రమాన్ని కాక మతాన్ని, పండుగలను వాడుకోవడం కొత్త విషయం కాదు. మతం మీద, దేవుని మీద ప్రజల్లో ఉన్న మూఢవిశ్వాసాలు ఇందుకు బాగా పనికివస్తాయి కాంగ్రెసు ప్రచారానికి తిలక్ వాడుకున్న గణేశ్ ఉత్సవాలు, గాంధీ అనుసరించిన పద్ధతులు ఇటువంటివే. పోనీ, ఈ మతం వల్ల, ఉత్సవాల వల్ల పేదప్రజల జీవితాల్లోకి ఏ మాత్రమైనా సుఖశాంతులు వస్తున్నాయా? ఎంత మాత్రమూ లేదనడానికి ఈ కథలో ధక్కువాడి జీవితమే ఉదాహరణ. ఇటువంటి దేవునిచుట్టూ, మతం చుట్టూ ఎంతగానో దుష్ట సంస్కృతి అల్లుకుని వున్నది. స్త్రీ పురుష సంబంధాల్లో అక్రమం, బూతు ఇందుకు రెండు ఉదాహరణలు మాత్రమే. గూండాయిజం లేకుండా పాలకవర్గ రాజకీయాలు మనుగడ సాగించలేవన్న విషయాన్ని, ప్రజల ప్రయోజనాలను బలియిచ్చి అవి అధికారాన్ని సాగించే విషయాన్ని ఈ కథ బాగా చిత్రించింది.

విలువలు నేర్పని చదువును పొందడం మన దేశంలో చాల విలువైన పని ఎంతోమంది పేద తల్లిదండ్రులు చదువుమీద మమకారంతో తమ కడుపు కట్టుకుని తమ పిల్లలను చదివిస్తే వారికి ఉద్యోగం ఉండదు. శారీరక శ్రమచేసి బతకడంపట్ల సమాజంలో ఆ చదువు కారణంగా తప్పుడు విలువలు ఉన్నందువలన అది జీవనోపాధిగా పనికిరాకుండా పోతుంది. కాని జీవితం దుర్భరమైనది. కడుపుకోసం కన్న కూతురిని పడుపువృత్తికి చేర్చేటంత దుర్భరమైనది జీవితం. 'అశ్వమేధం' ఇటువంటి జీవితాన్ని చెప్పే కథ.

'నరమేధం' కథలో ధక్కువాడి బూతులతోనే ఆగిపోయిన రథం కదిలినట్లుగా రాయడం బాగాలేదు.

ఈ కథల సంపుటికి రాచకొండ విశ్వనాథశాస్త్రి తాను రాసిన'ముందు మాట'లో "జీవితం గురించి ఈ రచయిత తీవ్రంగా ఆలోచిస్తున్నారనేదీ, జీవితంలో అన్యాయాల గురించి ఆందోళన చెందుతున్నారనేదీ ఈ వేట కథలు చదివితే తెలుస్తుంది" అన్నారు.

పురాణం సుబ్రహ్మణ్యశర్మ తన 'చివరిమాట'లో అన్నట్లుగా "ఈ కథలు చాలా అరుదైనవి" కాని వారు అన్నట్లు ఈ కథలలో 'మేల్ చావనిజం' కనిపించదు.

—'ప్రాణహిత'

---

మంచి ముత్యాలు (కథల సంపుటి)—అల్లం శేషగిరిరావు; పేజీలు: 208, 1/8 క్రౌన్ వెల రు 8/— లు, సోల్ డిస్ట్రిబ్యూటర్స్: న్యూ స్టూడెంట్ బుక్ సెంటర్, విజయవాడ-2.

## కథ

వర్తమాన సాహిత్యంలో మంచికథలు లేవనే విచారంతో, తపనతో మంచి కథల్ని జనానికందించాలన్న సదుద్దేశంతో కథాసాహితివారు ప్రచురించిన మొదటి సంచిక 'కథ'.

కథ ఎందుకు అని సంపాదకీయంగా ప్రశ్నించుకుని దానికొక జవాబు కూడా వీరు చెప్పుకున్నారు. ఏ కాలంలోనైనా "మంచి సాహిత్యం మంది సాహిత్యం" అని రెండుగా సాహిత్యం చీలివుంటుందన్న వీరి అభిప్రాయాన్ని వాళ్ళు వాడిన మాటలే వక్రీకరిస్తున్నాయి. మంచిసాహిత్యమంతా మంది సాహిత్యమే. "మంది" అనేమాట ప్రజలు అనే అర్థంలోనే ఇవాళ వాడటం జరుగుతున్నది. ఇవాళ ఎక్కడ చూసినా మందిసాహిత్యమే కన్పిస్తున్నదంటే అది మంచిదేగద! కానీ వీళ్ళు మంది అనే పదాన్ని మధ్యతరగతి పాఠకులన్న ఉద్దేశంతో వాడివుంటారు. ఎనభై ఏండ్ల తర్వాత తెలుగుకథకు తన స్థానం చెప్పుకోవల్సిన అగత్యం ఏర్పడిందన్నది గూడా సరికాదు. గురజాడ అప్పారావు నుంచి కాళీపట్నం రామారావు దాకా కథ ఎంతో ఎదిగింది. వస్తువులో, టెక్నిక్‌లో చాలా వైవిధ్యాన్ని సాధించింది. చింతా దీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, చలం, మునిమాణిక్యం నరసింహారావు, భమిడిపాటి కామేశ్వరరావు, కరుణకుమార, గోపీచంద్, మల్లాది రామకృష్ణశాస్త్రి, తెన్నేటి సూరి, కొడవటిగంటి, మా. గోఖలే, పాలగుమ్మి, రావిశాస్త్రి, చాసో, బుచ్చిబాబు మొదలైనవాళ్ళంతా కథని ఎంతగానో మెరుగులు దిద్దారు. వీళ్ళలో కొందరి రచనలు అంతర్జాతీయ స్థాయిలో ఖ్యాతిగాంచాయి. కాబట్టి తెలుగుకథ స్థానం ఎక్కడుంది అన్న ప్రశ్న సరైనదికాదు. ఈ ప్రక్రియ ఎవరి కుపయోగపడుతోందన్నదే ప్రశ్న. ఈ ప్రశ్నకి జవాబు సంపాదకీయంలో చెప్పినట్టుగా పెట్టుబడిదారుల బ్యాంకు కాతాల్ని నింపడానికి చేరుకున్నదనే. పోతే, ఉత్తమ కథల్ని ఏరి ప్రజల ముందుంచుతా నన్న కథాసాహితి తన మొదటి ప్రయత్నంలోనైనా కనీసం ఒక్క మంచికథనేకాదు-మామూలు కథను గూడా అందివ్వలేకపోయింది.

ఉన్న కథల్లో "జెండాకు అటూ....ఇటు...." అనేకథ మామూలు వారపత్రికలో వచ్చే కాలక్షేప కథాస్థాయికన్న ఎక్కువగా ఏమీలేదు. చాలా బలహీనమైన వస్తువు ఎన్నుకుని కథ రాయటంవల్ల, రచనా నైపుణ్య లోపం వల్ల కథలో కథ లేకుండా పోయింది.

రుమేనియా రచయిత జాబోగ్జా రాసిన ''కలాలకు సంకెళ్ళు'' మంచికథ. కథ కన్నా ఇది స్కెచ్ అనటం సరైంది. కానీ కాస్త బాగా వున్న ఈ రచన అనువాదం కావటం విచారించదగ్గదైతే - అనువాదమై కూడ ఏమీ బాగాలేనిది ఒరియా కథ ''పులమతి''. మంచికథలు లేనప్పుడు రాయించాలి. కథకులే పత్రిక నడిపేవారయితే కష్టపడి స్వయంగా రాయాలిగానీ పత్రిక బయటకు రావాలన్న తాపత్రయంలో అనువాదాలు, అర్థంలేని కథలు ప్రచురించటం వాళ్ళు చెప్పుకున్న ప్రయోజనానికి, ప్రయత్నానికి మేలుచేయదు.

జీవితంలో జరిగిన ''వాస్తవ కథ''గా జయధీర్‌గారు రాసిన కథ-ఒక లంపెన్ అనుభవం. దానిమీద ఇతర్లని కథ రాయమన్నా, తానే రాసినా దాన్నుంచి ప్రయోజనం ఏమీలేదు. దాన్ని రాసేముందు జయధీర్‌గారు కొంత ఆలోచించివుండాల్సింది.

జరిగిన ఇంకో పొరపాటు ఏమిటంటే మంచికథ లందివ్వకపోగా సమీక్షలో సైతం మంచికథల్ని దుయ్యబట్టారు. అల్లం శేషగిరిరావుగారి "మంచి ముత్యాలు" సమీక్ష చాలా బాధ్యతారహితంగా సాగింది. కథాసాహిత్యంలో ఆ కథలన్నీ వైవిధ్యాన్ని ప్రదర్శిస్తూ వుండగా కథా ప్రయోజనాల్ని బలిచేశారన్న విమర్శ సరైనదికాదు. "మృగతృష్ణ"లో బైరిగాడుగానీ "వజడు''లో దశరథరామయ్యగానీ "అశ్వమేధం" ధక్కువాడుగానీ జీవితం నుంచి వచ్చిన పాత్రలు. వాటి ఆలోచనా, ప్రవర్తనా చాలా సహజంగా వున్నాయి. జీవిత చిత్రణ స్పష్టంగా కనిపించటం కొన్ని కథల్లో జరిగితే ''జాతికుక్క, డెత్ ఆఫ్ ఎ మానీటర్, పులిచెరువులో పిట్టలవేట" వంటి కథల్లో నేపథ్యంగా కన్పిస్తుంది. ఇలా కన్పింపచేసే నేర్పే కథా ప్రక్రియకు ప్రాణం. ఈ గుణాలన్నీ చూడటం మాని నిర్దాక్షిణ్యంగా విమర్శించటం సరైన విమర్శ కాదు. పైగా వారు ఆ కథల్లో లేవని విమర్శించిన అన్ని లక్షణాలూ ఆ కథల్లో వున్నాయి.

"కథల్రాయకు" అనే డి. వెంకట్రామయ్యగారి రచనలో ఆశించిన వ్యంగ్యం లేదు.

చివరి పేజీలో "మంచికథ'' అనే సందేశాన్నిచ్చిన ''సమ్మ"గారు మంచి కథలు ఎలావస్తాయో చెప్పడానికి మాగ్జింగోర్కీ 'అమ్మ' నవలని ఉదహరించారు. నవలలో కథ ఉండవచ్చుగానీ ఆయన గొగోల్‌నో, చెహోవ్‌నో పేర్కొంటే సందర్భోచితంగా వుండేది. లేదా గోర్కీ కథల్నయినా పేర్కొనాల్సింది.

ప్రతి సాహిత్యకారుడూ ఇవాళ తన మార్గం ఎంచుకోవలసిన స్థితిలో వుండగ అందర్నీ తృప్తిపరచటం కోసం పత్రికా ప్రయోజనాన్ని నిర్లక్ష్యం చేస్తే అది ఎల వుంటుందో ఈ సంచిక నిరూపిస్తుంది. ప్రజాసాహిత్యం నుంచి కథా ప్రక్రియన విడదీసిచూడ్డమే సరియైందికాదు. కథ ఇవ్వాళ వ్యాపార పత్రికల కబంధ కౌగిలిలో గిలగిలలాడుతున్నది. ఆ వలయంనుంచి పాటలాగే అదిగూడా బయటపడే ప్రయత్న చెయ్యాలి. అందుకుతగ్గ దీక్ష కథా రచయితల్లో వుండాలి. అంతవరకూ ఏ ప్రయత్న చేసినా ఫలితం ఇంతే. ఈ విషయాన్ని ప్రజల కొరకు రాస్తున్న రచయితలని చూసీ ప్రచురిస్తున్న పత్రికలని చూసీ తెలుసుకోవచ్చు.

ఆధునిక కథారచనకు ఆద్యుడైన గురజాడ గూర్చి కథా ప్రయోజనాని కంకితమైన ఈ పత్రికగూడా కనీసం స్మరించకపోవటం కొట్టవచ్చినట్టు కన్పించే లోపం.

— కె. రాంమోహన్ రాజు

---

కథ_సంపుటి 1: మే 1982: వెల రూపాయి_సాలుసరి గౌరవ సభ్యత్వం రూ. 10. సాలుసరి పత్రిక చందా రూ. 10_ప్రతులకు: జయధీర్ తిరుమలరావు,1-8-1/117 సూర్యనగర్, చిక్కడపల్లి, హైదరాబాదు - 500020.

---

## పుస్తక స్వీకారం

1. చెరబండరాజు కవితలు, పాటలు, పీపుల్స్‌బుక్స్, విజయవాడ ప్రచురణ (మే 1982), 120+xx పేజీలు, 1/8 డెమీ, ఆరు రూపాయలు, ప్రతులకు: (1) సృజన, హనుమకొండ. 506001, (2) సి ఎస్ ఆర్ ప్రసాద్, సి-108, శ్రీనివాసనగర్, గుంటూరు 522006.

2. మృత్యుశిఖరం మీద యుద్ధఫిరంగి, చెరబండరాజుకోసం కవితా సంకలనం. విరసం హైదరాబాద్ యూనిట్ ప్రచురణ (జూన్ 82), 24 పేజీలు 1/8 డెమీ ఒక రూపాయి. ప్రతులకు : సి ఎస్ ఆర్ ప్రసాదు, సి 108, శ్రీనివాసనగర్, గుంటూరు 522006.

3. భావవిప్లవకారుడు కొడవటిగంటి సాహిత్య సమాలోచన_ప్రగతిసాహితి, న్యూఢిల్లీ ప్రచురణ (జూన్ 1982), 196 పేజీలు, 1/8 డెమీ, పదిరూపాయలు, ప్రతులకు : బివిజి తిలక్, 102, పూర్వాంచల్, జె ఎన్ యు, న్యూఢిల్లీ 110067

4. తెలంగాణ పోరాటకథలు, జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ (ఏప్రిల్ 1982) 208+xx పేజీలు, 1/8 క్రౌన్, ఆరురూపాయలు. ప్రతులకు మైత్రీబుక్‌హౌస్, లబ్బీపేట, విజయవాడ. 520 010

32. కళలు సాహిత్యం ఎవరికోసం ? - మావో 1-00
33. గోర్కీ కథలు 5-00
34. అభిరావాద్ అభిప్రాయాలు 0-50
35. పోలెండ్ కార్మికోద్యమం ఒక పరిశీలన 0-75
36. కళలు సాహిత్యం ఎవరికోసం ? వివిధ వ్యాసాలు 1-00
37. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం- త్రిపురనేని మధుసూదనరావు 1-00
38. సాహిత్యం కుట్రకాదు, రచయితలు కుట్రదారులుకారు త్రిపురనేని మధుసూదనరావు 1-00
39. సిపిఐ ఎం ఎల్ పీపుల్స్ వార్ రాజకీయ తీర్మానం 0-50
40. ప్రజాకళలు సాహిత్యం ఎలా ఉండాలి ? — వర్గీస్ 2-00
41. పగల్ కెండా - బ్యాలే 1-50
42. గద్దర్ పాటలు 3-50
43. ప్రజల పాటలు - అనుభవాలు 1-25
44. దావవిప్లవకారుడు కుటుంబరావు 10-00
45. రావి శాస్త్రీయం 12-00
46. Peddi shankar - Death by Encounter 2-00
47. Undeclared Civil war 2-00
48. సృజన - 100 సంచిక 5-00

ఈ పుస్తకాలన్నీ పీస్‌బుక్ సెంటర్, 4-5-421, సుల్తాన్‌బజార్, హైదరాబాద్ 500 001 దగ్గరకూడా దొరుకుతాయి.

పై పుస్తకాలు కావాల్సిన వారు అందుకు సరిపడిన డబ్బు ఎం.ఓ. చేస్తూ ఎం.ఓ. ఫారంలోని కింది కూపన్‌పై వివరంగా తమ అడ్రసు, తామెందుకు డబ్బు పంపుతున్నదీ రాయాలి. కూపన్‌పై ఏ వివరం రాయకపోయినా మేం పుస్తకాలు పంపలేం.

— సృజన
హనుమకొండ - 506 001

---

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Nagendra Printing Works, Vijawada 2, for Venkataramana Mudranalayam, Warangal.
Working Editor : Varavara Rao

SRJANA Telugu Monthly August '82 H/WL-10

Regd. No. with Registrar of Newspapers 10953/67.

# సృజనకు మీరేం చేస్తారు ?

సృజన ఆర్థికస్థితి నానాటికీ క్షీణిస్తుండడం గురించి జూలై సంచికలో ప్రకటించి ఉన్నాం. ఆ సంచిక నుంచే బాకీలు ఉన్న ఏజంట్లందరికీ పత్రిక పంపడం ఆపేశాం. ఒక్కొ సంచిక మీద రు. 800 నుంచి రు. 900 దాకా లోటు భరిస్తూ పత్రిక నడపటం కష్టం. ఐతే గతసంవత్సరం ఇట్లాగే పత్రిక ఆర్థికస్థితి బాగా క్షీణించాక మిత్రులూ, అభిమానులూ ఆదుకున్నారు. విరాళాలు, చందాలు సేకరించారు. కానీ సంవత్సరం తిరిగేసరికి పరిస్థితి మళ్ళీ మొదటికొచ్చింది. అంటే ఎప్పుడో సంవత్సరానికోసారికాక ఎప్పుడూ సృజన ఆర్థికస్థితి గురించి మిత్రులూ, అభిమానులూ పట్టించుకోవాలి. ఇందుకై మీ మీ ప్రాంతాల్లోంచి మీరు చేయగలిగిన ఆర్థిక సహాయం చేయమని, సృజనను బతికించుకోమని కోరుతున్నాం.

మీరేం చేయొచ్చు ?

1. సంవత్సర, అర్థ సంవత్సర చందాలు, జీవిత సభ్యత్వాలు చేర్పించొచ్చు. సంవత్సర చందా రు. 20, అర్థ సంవత్సర చందా రు. 10, జీవిత సభ్యత్వం రు. 200 (నాలుగు వాయిదాలలో).
2. విరాళాలు సేకరించొచ్చు.
3. ఏజెంట్లు సక్రమంగా డబ్బు పంపుతున్నారో లేదో కనుకోవచ్చు. ముఖ్యంగా సృజన నష్టాలు ఏజెంట్ల బకాయిలు పేరుకు పోవడం వల్ల వస్తున్నవే.
4. వ్యాపార ప్రకటనలు సేకరించి పంపొచ్చు. (పూర్తి పేజీ రు. 100, అర పేజీ రు. 50).
5. కొత్తగా ఏజెంట్లను ఏర్పాటు చేయొచ్చు.

మీరు చేయగలిగిన ఏ పనైనా తీసుకొని సృజనను బతికించుకొండి.

SRJANA Single Copy Rs. 2-00

HANUMAKONDA
506 001 Yearly Subscription Rs. 20-00